

A Soul - Stirring Play

for

The Modern Stage and Screen.

యల్లాపంతుల జగన్నాథం, బి. ఏ.,

# మ ద న సా య క

[ లఘుటీకా సహితము ]

నాటకరంగ, చలనచిత్రరంగముల కనుకూలించు [illegible]



"ఉ. * * సత్కవి కల్పనా విభూ

షావహ పుంస్త్వవ్యక్తగులు ♦ సానలఁదీరిన జాతిరత్నముల్."

— వసుచరిత్రము.



రచయిత :

యల్లాపంతుల జగన్నాథం బి. ఏ.,

1952

 [ మూల్యము రు 1-4-(

# నాటకప్రశస్తి - పరిచయవాక్యములు

[ డాక్టర్ గిడుగు వేంకట సీతాపతి ]

నా మిత్రులు శ్రీ యల్లాపంతుల జగన్నాథముగారు రచించిన "మదనసాయక" అనే నాటకమును చదివి ఆనందభరితుడనై మరల మరల అనేక పర్యాయములు చదివి గ్రంథకర్తగారి రచనానైపుణ్యము నే నెక్కువగా మెచ్చుకొన్నాను. అంతేకాదు. ఈ నాటకమును ప్రదర్శించ వలసినదని ప్రోత్సహించి ప్రదర్శించినపుడు శత్రుజిత్ పాత్ర మభినయించి యీ నాటక ప్రదర్శనమువలన కలిగిన సంతోషమును అపరిమితముగా పొందినాను. 'మదనసాయక'—ఆహా! ఎంతచక్కని పేరు! ఇది కథానాయిక కెంతచక్కగా ఒప్పియున్నదో నాటకమునకు కూడా అంతచక్కగానే ఒప్పియున్నదని చెప్పక తప్పదు. ఈ కథానాయికకు గల సుగుణసంపత్తి అంతా ఈ నాటకమునకుకూడా కలదు. ప్రసన్నత, మనోజ్ఞత, సుకుమారత మొదలైన లక్షణములు నాయికకు వలెనే నాటకమునకును ఎక్కువగా అమరియున్నవి. సహజ సిద్ధమైన సౌందర్యముతో నాయిక దీపించునట్లు స్వభావోక్తులతో నాటకము కూడా దీపిస్తున్నది. కథావస్తువు ప్రఖ్యాతిమైనది. అందులోగల సన్నివేశములను సంభావ్యములుగా చిత్రించడములో గ్రంథకర్త తన రచనానిపుణతను ఎక్కువగా ప్రదర్శించినారు.

ఈ నాటకమందలి కథావస్తువు మార్కండేయ పురాణమందలి ఋతధ్వజోపాఖ్యానమును, దాని నాధారముగా గైకొని రచితమైన కువలయాశ్వ చరిత్రమనే ప్రబంధ మందలి కథను అనుసరించి నాటక రచనకు అనుకూలించే కొలదిపాటి మార్పులతో పొందుపరపబడినది. ఋతధ్వజోపాఖ్యానమందలి మదాలస ఈ నాటకములో మదనసాయకగా పేరు పొందినది. ఆ ఉపాఖ్యానమందలి కథ పురాణఫక్కిని రచితమైనది. అందు రెండుభాగములు కలవు. మొదటిభాగము మదాలసా ఋతధ్వజుల వివాహముతో అంతమగును. రెండవ భాగములో

మదాలసా మరణ పునర్జీవనముల కథను కలసు ఈ కథాభాగములు రెండున్నూ పరస్పర సంబంధములతో ఏకైక కథాకల్పనకు అంగములుగా ఈ నాటకమందు సమకూర్చబడినవి. కథలోగల సన్నివేశములను ఎంచుకొనుటలోను, వాటిని పరస్పర సంబంధములతో రచించుటలోను గ్రంథకర్త తన విజ్ఞతను, రచనా చమత్కృతిని చక్కగా వెల్లడించెను.

నాటకమంతా సంప్రదాయ సిద్ధమైన లక్షణముల ననుసరించి రచితమైనది. సంకల్పిత సన్నివేశముల సౌకర్యమును బట్టి అంక విభాగము సాగినది.

మొదటి అంకములో "సంకల్పోద్యమములు" నిరూపితము లైనవి. తాళకేతు వెన్నుకపోయి తన పాతాళలోకమున దాచియుంచిన మదనసాయకను మరల తీసుకొని వచ్చుటకు తుంబురుడను గంధర్వ గురువున్నూ, దుష్టరాక్షస సంహారము గావింపబడు గాలవుడను ఒక మహర్షిన్నీ, తాళకేతుని పట్టి బంధించుటకు కథానాయకుడైన ఋతధ్వజుడున్నూ సంకల్పించి అందుకు తగిన ప్రయత్నములు గావింతురు.

రెండవ అంకములో సంకల్పోద్యమములు నెరవేరగలవన్న ఆశ ఉదయించి విడంబించును. ఋతధ్వజునిచే తాళకేతుని చంపడం జరుగును. దానివలన తలవని తలంపుగా మదనసాయక తాళకేతు నిర్బంధమునుండి విముక్తురాలయి ఋతధ్వజునిపై మరులుగొనును. అశ్వతరుడను నాగరాజు, గాలవుడను మహర్షి, తుంబురుడను గంధర్వ గురువు పొందిన సంతోషమును ప్రదర్శనము చూచు సభాసదులు సైతము పొందుదురు. మదనసాయకా ఋతధ్వజులు వధూవరులు కాగలరనే సూచన స్పష్టమగును.

మూడవ అంకములో కాబోవు దంపతుల యన్యోన్యానురాగ ప్రేమసల్లాపములు రసవంతములుగ రచితములగుటచేత ప్రేక్షకుల దృష్టి

నెక్కువగా ఆకర్షించి ఆనంద మొదవించును. శృంగార రసభూయిష్ఠము లయినను సల్లాపములు, హాస్యములు సభ్యములయి సంతోషము కలిగించును.

నాల్గవ అంకములో ప్రతీకార సన్నివేశములు కలవు. తూర్య శేఖరుడు తన సోదరుని చంపినవానిపై పగసాధించును. అప్రస్తుతాచారము నకు విరుద్ధముగా ఆచరించిన శత్రుజిత్తుపై చండిక కోపముపూని కష్టములు కలిగించి దండింపనెంచును. శత్రుజిత్తునకు కలిగిన సుఖదుఃఖ ములు ఒకటి వెనుక నొకటి మారుతూ వచ్చుటచేత తుదకు ఏమి కానున్నదో అతడు చెప్పలేకపోయినట్లే ప్రేక్షకులుకూడా చెప్పలేని సమస్యలో పడినారు. గ్రంథకర్త రచించెను శత్రుజిత్ పాత్రను ధరించిన నటుని నటనాచమత్కృతి ప్రదర్శించుటకు ఎంతైన అవకాశము కలదని నేను నా అనుభవముతో చెప్పగలను.

అయిదవ అంకము సుఖాంతమైనది. కలిగినకష్టములు "మరుద్వి భూతి" మేఘములట్లు చెదరిపోవును. ఊహాతీతములైన వింత వింత సన్నివేశములు స్వభావసిద్ధములుగానే పుట్టి ఆకష్టసుఖములన్ని అనుభ వించిన వారితో సమముగా ప్రేక్షకులుకూడా—తాదాత్మ్యలికముగా నే [illegible] అనుభవించి తుదకు శుభమస్తు అని అవతానందమును [illegible].

పాత్ర పోషణము సూక్ష్మ చిత్రముగా సాగినది. లోకానుభవము, కార్యము కలిగిన మహోన్నతులైన రాజులకుండవలసిన నయవినయా సుగుణసంపత్తి, రాజసము, గాంభీర్యము శత్రుజిత్తులోను, అట్లే రాజవం మున బుట్టిన యువరాజుల కుండదగు పౌరుష పరాక్రమములు, అస్త్ర ప్రయోగ దీక్ష, ధైర్యసాహసములు మొదలైన సద్గుణములు బుధిధ్వజు యందును, సద్వంశ సంజాతలగు రాజకన్యలకుండదగిన శాలీనతా మానాభి మానములు మదనసాయకయందును, ఆప్తులకును, మిత్రులకును ఉండ వలసిన సౌభ్రాత్రము, సౌజన్యము, కష్టసుఖములకు తోడుపడుట లెనన్న

స్వభావము మొదలైన లక్షణములు అశ్వత్థ విశోకాలయందును, మహార్షులకుండే ఆత్మసంయమ లోకకళ్యాణ రక్షాదియగు సద్గుణములు గాలవ మహర్షియందును యథాతథంగా చిత్రితములైనవి. నీచ పాత్రములను నిరూపించు విషయములో సైతము గ్రంథకర్త ఎవరికి విశిష్టమైన గుణములు వారియందు స్పష్టముగా విశదీకరించెను. కాళిదాస మహాకవి విరచితమైన అభిజ్ఞాన శాకుంతలమందు అనసూయా ప్రియంవదల యందు గల తారతమ్య విశిష్టలక్షణములు నిరూపితములైనట్లే ఈ నాటకము నందలి చెలికత్తెలు సైతము ఒకతె విలాసక్రీడాశీలగాను, మరియొకతె అనుకంపామతి యగు సహాయగాను చిత్రించబడిరి.

ఈ నాటకమందలి పద్యములు, గేయములు హృద్యములుగాను, కర్ణరసాయనములుగాను ఉన్నవి. కొన్ని పద్యములలోని భావనలు షేక్స్పియర్ మొదలైన పాశ్చాత్యకవులు రచించిన కావ్యములనుండి గ్రహించినవి. అయినా, అవి ఎరువుగా తెచ్చుకొన్న వస్తువులవలెగాక మనకు స్వభావసిద్ధములుగా నున్నట్లే నిరూపితములైనవి. అట్టివి కొన్ని ఈ దిగువన ఉదాహృతములైనవి:—

1. తరుణి!... (పుట 22)
2. తన కనంగ... (పుట 36)
3. (గేయము) అహాహా! వనకామిని... (పుట 52)
4. రాజనందన... (పుట 74)
5. హా! సతీయంచు... (పుట 94)

ఈ నాటకమందలి భాష సంప్రదాయసిద్ధమైన కావ్యభాషకనుక దీనిని పాఠ్యగ్రంథముగా నిర్ణయించుటకు అధికారులు సంకోచింప నక్కరలేదు. అంతేకాక, ఈ నాటకరచన అన్నివిధములను యోగ్యమైనది. విద్యార్థులు నేర్చుకోదగిన విషయము లీ నాటకములో ఎక్కువగా కలవు. దీని ప్రశస్తిని గ్రహించి యిదివరకొకసారి 1922 లో మద్రాసు విశ్వవిద్యాలయమువారు దీనిని ఇంటర్మీడియెట్ పరీక్షకు

వివరణసహితముగా పఠించవలసిన గ్రంథముగా నిర్ణయించినారు. ఆం
విశ్వకళాపరిషత్తువారు ఇప్పుడు పాఠ్యగ్రంథములుగా నిర్ణయించుచు
నాటకములతో ఇది ఏ విషయములోనూ తీసిపోదు.

ఈ నాటకము ప్రయోగింపదగినది కనుక నాటకసమాజములవా
దీనిని ప్రదర్శింతురుగాక! అని హెచ్చరిస్తున్నాను.

గ్రంథకర్తకు నా అభివందనములు. ఈ నాటకమునకు ప్రశ
పరిచయ వాక్యములు వ్రాయవలసినదని కోరినందుకు వీరికి నే
కృతజ్ఞుడ

మద్రాసు
1 ఫిబ్రవరి 1952

(డాక్టర్) గిడుగు వేంకటసీతాప

# పీఠిక

నాటకకళా ప్రవీణులును, ఈ నాటకమందొకప్పుడు ప్రముఖ పాత్ర ధరించిన వారును, నాకు ప్రియమిత్రులును, అగు డాక్టర్ గిడుగు వేంకట సీతాపతిగారు నా "మదనసాయక"కు ప్రశస్తి పరిచయ వాక్యములు వ్రాయుటలో గ్రంథకర్తనగు నేను చదువరికి నివేదించుకొన వలసిన విషయములుకూడ తామే చాలవఱకు రచించి యుండినను దీని విషయమై రెండు మాటలైనను నేను మనవి చేసికొనక తీరదుకదా?

ఇప్పటి నాటకరంగమునకును, చలనచిత్ర రంగమునకును సమానముగ నుపయోగింపఁదగినట్టిదే కాక భాషాసాహిత్య పిపాసువులచేఁగూడఁ దలయూఁపింపఁగలట్టి నాటక మొకటి రచింపవలెననెడి నా చిర సంకల్పమే మదనసాయకా నాటకరూపమునఁ బరిపూర్తి నొందినది. పూర్వరచయితలచే నాదరింపఁబడిన ప్రాచీనమగు నితివృత్త మొకదాని నాధారముచేసికొని నటనా చమత్కృతికనువగు సన్నివేశములనుగూర్చి రసస్ఫూర్తిని, భావప్రసన్నతను, పదలాలిత్యమును ప్రధానముగ పాటించి శ్రవణానందకరములగు గద్యపద్య గేయములను, సభ్యములగు సల్లాపములను, అపూర్వములగు వర్ణనలను రసోచితములుగఁ జేర్చి యీ నాటకము రచింపఁబడినది. ఇది సంప్రదాయ సిద్ధములగు కట్టుబాట్లతోడను, పరిభాషతోడను గూడియుండుటచే దీనిని చదివినప్పుడుగాని, నాటకరంగమందునో, "వెండితెర" మీఁదనో ప్రదర్శింపగా చూచినప్పుడుగాని మానవ హృదయమున నున్నత భావతరంగములు జనించి తన్మూలమున సామాజికోన్నతి కవకాశము కలుగునని సాహసించి చెప్పఁగలను. ధనార్జనమందే దృష్టినిలిపి శృంగారరసము పేరట నసభ్యములును, అశ్లీలములును నగు వర్ణనలు కల యే నాటకము లిప్పుడు కుప్పతెప్పలుగ రచితములై ప్రదర్శింపఁబడుచున్నవో, తరుణవయస్కులగు నేఁటివిద్యార్థులకవి విషప్రాయములై సదా కష్టకామ చింతనములతో వారల హృదయములను నింపుచు వారల విద్యాభివృద్ధి కవరోధము కల్పించి నైతికముగ

వారల కధఃపతనము కల్గించుచున్నవి. మానవసభ్యతకు వేరుపురుగులవలె నున్న యిట్టి నాటకములను, నవలలను విద్యాశాఖవారు నిషేధించి "మదనసాయక" వంటి ఉత్తమ రచనలను విద్యార్థుల కందఁజేయుట సమంజసము.

ఇప్పటికి ముప్పదియేండ్ల క్రిందట మద్రాసు విశ్వవిద్యాలయము వారు "మదనసాయక"ను కళాశాలావిద్యార్థులకు అవశ్య పఠనీయ గ్రంథముగ నిర్ణయించి యున్నారు. ఇప్పుడిదియే జాతిరత్నమువలె యథోచితములగు సంస్కారములతో సానలఁదీఱి క్రొమ్మెఱుఁగులీనుచు మరల ప్రకాశితమగుచున్నది. దీనిని నాట్యకళాపరిషత్తు వారాదరించుటే కాక స్వాతంత్ర్య వాతావరణము ననుభవించుచున్న మనదేశమం దిపుడు దేశభాషలకు ప్రాముఖ్యత యేర్పడినందున తత్పరాభివృద్ధికి మాతృస్థానములైన విశ్వవిద్యాలయముల కధికారులగువారు కూడ డాక్టర్ సీతాపతి పండితులు నిరూపించిన విధముగ దీని ప్రశస్తిని గ్రహించి తమవిద్యార్థులకిది పాఠ్యగ్రంథముగ నిర్ణయింపవలెనని సవినయముగ వేడుకొనుచున్నాను. విద్యార్థుల సౌకర్యమునకై లఘుటీక యొకటి చేర్పఁబడినది.

దీనిని ప్రదర్శింపఁగోరువారు తమప్రేక్షక బృందమున కనుకూలించు విధమున నిందలి మాటలుగాని, పాటలుగాని నా యనుమతినొంది యథోచితముగ మార్చవచ్చును. క్రొత్తవి చేర్చవచ్చును; నా సారస్వతసేవ రసజ్ఞుల కాదరణీయముగుగాక యని భగవంతుని ప్రార్థించుచున్నాఁడను.

ఏలూరు,
15 ఫిబ్రవరి 1952.

యల్లాపంతుల జగన్నాథం, బి. ఏ.

## ఈ నాటకమున వచ్చెడి పాత్రములు.

### పురుషులు.

శత్రుజిత్తు—అధీశ్వరుఁడు.

ఋతధ్వజుఁడు—యువరాజు. (కథానాయకుఁడు.)

అశ్వతరుఁడు—ఒక నాగరాజు.

విశోకుఁడు—అశ్వతరుని కుమారుఁడు.

గాలవుఁడు—ఒక మహర్షి.

తుంబురుఁడు—గంధర్వగురువు.

విశ్వావసుఁడు—మదనసాయక తండ్రియగు నొక గంధర్వుఁడు.

తాళకేతుఁడు—రాక్షసరాజు.

తూర్యకేతుఁడు—తాళకేతుని తమ్ముఁడు.

### స్త్రీలు.

మదనసాయక—విశ్వావసుని కొమార్తె. (కథానాయిక.)

కుముద్వతి—మదనసాయక తల్లి.

కుండల—మదనసాయక ధాత్రేయి.

మఱియు, మంత్రి, సభ్యులు, రాజపరివారము, ప్రతీహారులు, మునికుమారులు, వృద్ధకంచుకి, ఆశ్వికుఁడు, చెలికత్తెలు, చేటి.

---

# మదనసాయక

[ నాంది ]

ఉ. "ఏ మెయిదీవె యందొదవు ♦ నింగిర! చిందగు చంద్రచాపముల్
తామరదోయి చక్రకుచము ♦ దమ్ములు?" నాఁ దలవంచి నేర్పుమై
"నీ మెయిదీవె" నంచు హావ ♦ ణించిన వ్రీడ నిజేశుఁ గాంచు నా
కామునిఁ గన్నతల్లి కఁగ ♦ గన్నుల చూడ్కులు మిమ్ము నోముతన్.

[ నాద్యంతమున ]

సూత్రధారుఁడు—[ప్రవేశించి] అవునవును. లోకజనని యెవరికి సంసేవ్యురాలు కాదు? వెండియు, ఈ దినములలో ఆ సౌభాగ్యదాయినిని గొలువని సీమంతిని యుండునా? ఇప్పుడు ఏవరవర్ణిని మోముఁజూచినను లక్ష్మి అచటనే తాండవమాడుచుండును. ఏనివాసము గనినను శోకరహితమై, "నిత్య కళ్యాణము పచ్చతోరణ"మై కనుపట్టును. "వరలక్ష్మి" అవతరణమేకదా యిందులకుఁగారణము? మఱియు నాసతికి నేఁడు తీరుబడియేలేదు. [ఆకర్ణించుట నభినయించి] పేరంటాండ్ర మంగళగీతములు ఇంకను వినవచ్చుచునేయున్నవి. కాని ఆమె సపర్య యిప్పటికిఁ బూర్తియైయుండును. కావున నిఁక నామె నిచటికి రావించెదనుగాక. [అని తెరవంకఁగని]

క. రూపత్తిన సౌభాగ్యమ!
నీపూజన మయ్యె నేని ♦ నీతోడుత స

ల్లాపింపఁగార్య మొదవెడఁ;
నాపని వినిచెద విరాన ♦ నరుదేరఁగదే.

నటి—[ప్రవేశించి] ఆర్యపుత్రా! వచ్చితిని. ఏమియాజ్ఞ?

సూత్ర—[సాకూతముగా] నటీ! వింటివా? ఇప్పుడీ సరసులకు ''మదనసాయక'' ప్రయోగమే విహితమఁట?

నటి—[సాకూతముగా] ఆర్యపుత్రా! అదియెట్లు? ఇది వాన కాదు గదా?

సూత్ర—[దరహాసముతో] అయిననేమి? కామజనక సీమంతిని ప్రతిగృహమ్మున నెలకొనియుండ ఈ దినములు మాత్రము క్రీడాయోగ్యములు కావా! ప్రేయసీ! ఎట్లయినను సభ్యుల యిష్టమే యిప్పుడు జరుగవలయు.

నటి—అట్లులే కానిమ్ము. కాని యీరూపకము మనకు అతినవీనము కాదా?

సూత్ర—సుందరీ? ఈసందేహమే నన్నును వేధించుచున్నది.

సీ. ఇతివృత్తమా ప్రాఁత ♦ దే కాని రచనా వి
ధానమ్ముఁజూడ నం ♦ తయును క్రొత్త
గద్యపద్యములల్లఁ ♦ గా నేర్చుఁగాని యు
ద్గ్రంథనిర్మితికి నీ ♦ కవియుఁ క్రొత్త
ఇతర నాటకములా ♦ డితి మెన్నియో కాని
మనకు నీనాటక ♦ మ్మనఁగఁ క్రొత్త
కరుణాద్భుతములు ము ♦ ఖ్యరసమ్ము లొనరింపఁ
బూనుట నాటక ♦ మ్ములకె క్రొత్త

ఇంక నెటులుండునో మన ♦ మిప్పుడాడఁ
బోవు నీరూపకమ్ము పూఁ ♦ బోఁడి! అయిన
నేను జంకను జుమి; భవా ♦ నీకటాక్ష
మొలయు మనయెడ; భంగపా ♦ టొదవ దిపుడు.

నటి——సత్యము సత్యము. అయిన నిఁక జాగేల? ఆర్యపుత్రా!

సూత్ర——అవును. కర్తవ్యమిఁక నడపుదము. కాని ప్రాణే
శ్వరీ! ఇప్పుడు ఏఋతువును బాడి యీసదస్యుల మన
ములు రంజింపఁజేయుదువు?

నటి——ఆనతియైనచో, "అప్రస్తుతప్రశంస"కుఁబోక ఏతదృతు
వర్ణనమే కావించెద.

సూత్ర——'వాన కా' రనియుంటివే? ఏదీ చూతము?

నటి——[నాట్యమొనర్చుచు గానముసేయును]

[ గేయము ]

మలచతిరియన్ బురి వీడఁగ నాహా! మయూర మాడు నదే
కనునాథా! నాథా! మయూర మాడు నదే
శరనే చెన్[2] శరమేది మరుండు ధరించె మొగలి సురియన్
కనుపింపై[2] హరివిలు దోఁచెడు నదిగో నదిగో కను రమణా!
మొగుల డాఁగి పద్మిని కినుఁ డగడు సల్పు నవురా!
వగగొ కుముద్వతికి రజనికరుఁడు గూర్చు నయయో! . .
విను నాథా! నాథా!

సూత్ర——ఏమేమి? ఏమనుచున్నావు?

నటి——"కలఁచెన్ గుముద్వతిన్, రజనీకరుండయో!"

సూత్ర—[హర్ష సూచకముగా] భళిభళి సాధ్వీ! నీనోఁట నమృతమొలికినది. వానతటికి నీవెంత యింపుదెచ్చితివే? కాని,

గీ. పద్మిని కినుండు నలకుము ♦ ద్యుతికి రజని
కరుఁడు పెతఁగూర్చు చెన్నఁడు ♦ కనము వినము;
నెత కుముద్వతి కిపుడు గా ♦ వించు నతఁడు
రజనికరుఁడ డౌ? సఖి! కాఁడు; ♦ రజనిచరుఁడు.

మానమిఁకఁ బోవుదమా?

నటి—మహాప్రసాదము. [ఇర్వురు నిష్క్రమింతురు.]

---

# మ ద న సా య క



## ప్ర థ మాం క ము

స్థలము—గంధర్వపురి : రంగము—విశ్వావసుని మందిరము

[విశ్వావసుఁడును, కుముద్వతియుఁ బ్రవేశింతురు]

కుము—[విచారముతో] అమ్మో కుమారీ! మమ్మెంతయదృష్ట హీనులం జేసితివే. కాలుని దృష్టిపథమ్మున నీవింత చిన్ననాఁటనే పడుదువని కలనైన ననుకొననైతిని తనయా!

చ. "ఇదె చనుదెంతుమమ్మ! చెలు ♦ లేను" నటంచు సఖీజనమ్ముస
మ్మదమునఁదోడఁకొంచు సల ♦ మందరశైలము పజ్జ కీ వయో!
కొదుకక పోవుచుంట గనుఁ ♦ గొంటిని వేడుకతోడ; నెట్లు సైఁ
చెదవెత నింక? నాకడుపుఁ ♦ జిచ్చొనరించితివే కుమారికా!

విశ్వా—[విచారముతో] కటకటా! హర్యక్షము వాతబడ్డ హరిణి తెఱంగున నాకూఁతురు ఈ యాతుధానుని చేఁ జిక్కినది గదా? ఇఁక నేనెటులీ యమితశోకమును సహింతును? పుత్రీ! మదనసాయకా! మద్గృహదీపకళికా! నా గీము నలముకొనిన యిరులెట్లు తొలంగునే!

కుము—[సశోకము] హాపుత్రీమణీ! ఈనఁగాచి నక్కలపాలు చేసినట్లు శైశవమునుండియు నిన్ను మిగుల గారాబముతోఁ బెంచి పెద్దదానినిఁ జేసి తుదకొక పాడురక్కసుని కఱకు హస్తముల కప్పగించితిమి కదే? మమ్మెట్లు విడనాడి పోయితివి బిడ్డా!

ఉ. శోకమునొందు నీ సఖుల; ♦ జోఁపకపండ్లనొసంగుదంచివే
నీకయిచూచు చిల్కలను; ♦ నీనడ నేర్చుచు వెంటరాఁగఁ జీ
కాకున నీవు ద్రోచినను ♦ గ్రమ్మఱిపోవని యంచపిండుఁ; జిం
తాకలితాత్మలైన తలి ♦ దండ్రుల నెట్లెడఁ బాసిపోతివే?

అయ్యో పట్టీ! నేనెటులీయమిత శోకసాగరమును దరింతును? నిన్నుఁదలంచిన నాకడుపు చెఱువగుచున్నదే!

విశ్వా—[భార్యహస్తమువట్టి] ప్రేయసీ! ఊఱడిల్లుము. ఈ విచారమున కంతమెక్కడ? పురాకృత దురితఫల మనుభ వింపక తీఱునా?

కుము—[తెరవంకఁ కని, దిగ్గన లేచి] ప్రాణేశ్వరా! అదిగో! మన గురువరులగు తుంబురు లరుదెంచుచున్నారు.

[అంతఁ దుంబురుఁడు ప్రవేశించును]

విశ్వా—[కని, మోఁకరించి]గురూ! వందనము. [లేచి, నతాననుఁడై] తామీశిష్యుని మోము చూడరాదు. వీఁడు మొందుగఁ శాపము జేసినవాఁడు.

తుంబు—[వానికరద్వయమువట్టి] గంధర్వశిఖామణీ! విచారింపకుము. నీకొదవినకష్టము నీయట్టి సుగుణసంపన్నునకు రాఁగూడదు. నేనీదుర్వార్త వినిన క్షణముసఁ జేష్టలుడిగి తిని జుమా.

విశ్వా—[కేల్మోడ్చి] మహనీయా! తమరాకచే నాగృహము పావనం బయ్యెను. దయచేసి యీపీఠము నలంకరింపుఁడు.

తుంబు—అటులటులే. [అని యాసీనుఁడై, జాయాపతుల నుద్దేశించి] విశ్వావసూ! కుముద్వతీ! మీ రిట్లు గొందల

పడుట తగదు. దైవయోగ మనుల్లంఘనీయముగదా?
[అని కొంతవడి యూరకుండి] ఖేచరోత్తమా! నిన్నొక
సారి చూచి రాఁగుటకే కాక మఱియొక సంగతికూడఁ
జెప్ప నేతెంచితిని.

విశ్వా—అదేమియో సెలవిండు.

తుంబు—వినుము. నేఁటి యుషఃకాలమున నేనమరతరంగిణీ
జల స్నాతుఁడనై యొడ్డునఁగూర్చుండి తపమొనరించు
చుండ నొక నాగకుమారుఁడు నాకడకరుదెంచి ప్రణతుఁడై
నాచేతనొక కేతకీదళముంచిపోయినాఁడు. అది వివిధపరి
మళోపేతంబగుటచే దాని నెవ్వతయో ఒక యువతిపంపె
నని యూహించినాఁడ. పరికించిచూడ ముత్తెపుసరులం
బోలిన అక్షరపుఁబంతులుదానిపైఁ దోఁచినవి. కాని తద
ర్థము ఆ లేకరి హృదయమువలె దురవగాహముగనున్నది.
[పైకిఁదీసి] ఇదే, కనుము.

విశ్వా—[కొని,కని] అహో! ఏమికూర్పు! (అని చదువును.)

చ. "గురువర! ఏడనున్న మదిఁ ♦ గోర్కెయొకింతయు లేద మీవియ
చ్చరులను జూడఁ? జేడియల ♦ జన్మఫలమ్ములు చెప్పనట్టి నే
ర్పరులరు కారె మీ? సరయి ♦ రండు; భవన్మహిమమ్ము తోడుగాఁ
బరిగును మీకు; నాకపుర ♦ వాసు లెఱుంగరె నాగవాసముల్?"

తుంబు—చూచితే లేకరిచమత్కృతి? వెండియుఁ గ్రిందఁ
గనుము. కర్ణకుండలాకృతిగల యొకముద్రయున్నది.

విశ్వా—[పరికించి] అవును. కుండలాకృతి యొప్పుచున్నది.
ఇది లేకరి నామసంజ్ఞ. [భార్యంగని] జీవితేశ్వరీ! మన
మదనసాయక చెలియగు కుండల వ్రాసియుండునా?

కుము—అయ్యో వెడగుభ్రమ! రాక్షసాపహృతయగు మన కుమారికిఁ గుండలపరిచర్య అబ్బుటెట్లు? మనమంతధన్యులమా? హాపుత్రీ! (అని కుందును.)

తుంబు—మఱియు, "నాకపురవాసు లెఱుంగరో నాగవాసమున్" అనునదిచూడ నాగలోకవాస్తవ్యులగు మనవారలెవరో రచించినట్లు తోఁచుచున్నది.

విశ్వా—గురువర్యా! ఈలేఖచూడ మా తనయ జీవించియున్నట్లు నాకుఁ దోఁచుచున్నది. అదియెటులో నేను వచింపఁజాలను.

తుంబు—అట్లయగుఁగాక. ఎట్లయిన భోగిపురికి నేనిప్పుడే పోయెదను. దీనికర్త నారయుటయేకాక మీ మదనసాయకావృత్తాంతము సైతము తెలిసికొనఁగడంగెదను.

[కుముద్వతి నుద్దేశించి] అమ్మా! కుముద్వతీ! ఊఱటఁ జెందుము. నేను బోయి వచ్చెదను.

విశ్వా—పండితోత్తమా! నమస్కరించుచున్నాఁడను.

తుంబు—స్వస్తి. మీరిఁక లోనికరుగుఁడు. మేలివార్త నేను మీకుఁ దెచ్చునట్లు గావించుటకై సర్వేశ్వరునిఁ బ్రార్థించెద. [అని నిష్క్రమించును.]

విశ్వా—[భార్యంగని] ప్రేయసీ! మన కుండలయు ఎచటను గానంబడదుగదా?

కుము—నాథా! మనకుమారియు, కుండలయు, ఏకక్షణమున మటుమాయమైరఁట. వారిఁజేసు నాకు వలదు. దైవము విషాదమే నానొసట వ్రాసెను.

విశ్వా—ప్రియా! ఊఁటడిల్లుము. లోనికేఁగుదము పద.

[ఇర్వురు నిష్క్రమింతురు.

---

స్థలము—సాకేతపురి : రంగము - పురోపకంఠము.

[గాలవ మహర్షి ప్రవేశించును.]

గాల—[యోజనాపరుఁడై] స్వర్గలోకము నెల్లఁ జక్కఁబెట్టి యీలోకమున కరుదెంచిన యీ రాక్షస సమూహమెచ్చటిది? వీరి నాయకుఁడగు తాళకేతుఁడెవ్వఁడు? ఔరా! ఏమి వీరి దారుణము!

చ. పనివడి హోమధేనువులఁ ♦ బట్టి వధించిరి; శిష్యవర్గమున్
దునిమిరి; మేటిమౌనులను ♦ దోరపుఁజేతుల మొత్తి ముద్దగా
నొనరిఁచి; రంతమానక మ ♦ హోద్ధతిఁ బర్ణకుటీరపాళి న
య్యనలుని పాలుచేసి జటి ♦ లాంగనలన్ జెఱవట్టి రయ్యయో!

కటకటా! ఇఁక మునుల పర్ణశాలలెక్కడ? ఏయెడంగనిన,

గీ. దగ్ధ పర్ణకుటీరముల్ ♦ దళిత శిష్య
జనకళేబరములు యతి ♦ శల్యపంజ
రములు నల్లలుఁ గుళ్లు మాం ♦ సములు దోఁచు;
మేటి మునివాటిక శ్మశాన ♦ వాటియయ్యె.

మేము పవిత్రులము. పరాస్పృష్టులము. తపోధనులము. ఇంతియకాక రక్తమాంసములు కృశించి యెమ్ముల ప్రోఁగులవలెనున్నాము. ఇట్టి మమ్ములనుగూడ ఈసోఁకుమూఁక విడనాడక పొట్టంబెట్టుకొనుచున్నది. ఎందఱో మునులు వీరి కప్పుడే ఆహారమైరి. ఎందఱో యిఁకఁగానున్నారు. అహో విధికృతము! మా తపమేమయినట్లు? దాని సాయము మాకు వలదా? అదియేకదా మా కాయుధము? [యించుక యోజించి]

ఛీ! ఛీ! ఇట్లంటినేమి? తపఃప్రయోజనమునకు అవరోధము కల్గినఁగల్గెంగాక. దానిబలమును అకారణముగ నశింపఁజేయు నట్టిదెద్దియులేదు. ఒక మహావీరుని తోడు మాకుండెనేని ఈ యాతుధానుల నవలీల జమునికడకు నాగనంపకుందునా? అట్టి వానినరయుటయే ప్రస్తుతము నాకుఁ గర్తవ్యము. ఇంతియ కాక,

గీ. యజ్ఞగంబులఁ గనుమోడ్పు ♦ ప్రొద్దులోనఁ
పవనజవమునఁదిరుగు న ♦ క్తమున కండు
నా తపస్సు మహాస్త్రమ్ము ♦ నన్ సృజించి
యాతని కొసఁగెద నసుర సం ♦ హారమునకు.

ఇప్పుడు నేవచ్చిన చెచ్చటికి? [పరికించి] అయోధ్యోప కంఠమునకు. [నిరూపించి] అకనఁబడునదియే రాచనగరు. శత్రుజిత్సార్వభౌముఁడిప్పుడు కొలువుకూటమున నుండి వచ్చెను. ఓహో! మఱచితిని మఱచితిని. ఇతని కుమారుఁడు ఋతధ్వజుఁడు మిగుల పరాక్రమవంతుఁడని వినియుంటినిగదా? ఇఁక నా కార్యము ఫలించినట్లే. కావున నేనిప్పుడే అతని యొద్దకుఁజని అసురసంహారమునకు ఋతధ్వజుని నావెంటఁ గొనిపోయెదను. [అని నిష్క్రమించును.]

స్థలము — మునుపటి సంగను - శత్రుజిత్తుని సభామంటపము.

[రాజును, మంత్రియు, సభ్యులు, ప్రతీహారిలు ప్రవేశింతురు.]

శత్రు—మంత్రీ! మన సేనాని పంపిన వార్తలు చెప్పుము.

మంత్రి—దేవా! ప్రథమదినవార్తలు ఏలికకు ముందుగా నివేదించెద. నిర్జరలోకము నెలువడి ఆనాఁడే ప్రప్రథమమున ఒక రాక్షససేన మనరాజ్యమునఁ బ్రవేశించినదఁట. మన సైనికులు వారితోఁ దీవ్రయుద్ధమొనర్చి అనేకులను దును

మాడి తక్కినవారిని బటాపంచలొనర్చిరఁట. ఆదినమున వారలు కొల్లవెట్టిన యూరువల్లెలం దిపుడు మరలఁ బ్రశాంతి నెలకొనెనఁట. మఱియు, ఆదినమున వారివలనఁ జంపఁబడిన ప్రజలు అల్పసంఖ్యాకులని తెలియవచ్చుచున్నది.

శత్రు—వారు తమ అగిడములకు దేవలోకము చాలక మన లోకమునకుఁగూడ నవతరించిరిగదా? ఇఁకవారు నామావశిష్టులగుమాట సరిని సట వ్రాసియుండనోపు. తరువాత తరువాత ?

మంత్రి—ఇఁక రెండవదినము సమాచారములు దేవర ఆలింతురుగాక. తొలినాఁడు వచ్చిన సైన్యమునకు ద్విగుణముగా ఒక మహాసేన నాకలోకమునుండి తరలివచ్చినదఁట. వారలనేక గ్రామముల ననలాహుతియొనర్చి తగుపాటి ప్రాణహానికూడ గావించినట్లు సేనాని తెలుపుచున్నాఁడు. మన సైనికులు వారితో హోరాహోరిగఁ బోరాడిరికాని రాక్షసులసంఖ్య అధికమగుటచే మన సైన్యము పలుచఁబడినదనియు, వారి సాయము కొఱకు మఱియొక క్రొత్తసైన్యమును శీఘ్రముగఁ బంపవలెననియు అతఁడు గోరినాఁడు.

శత్రు—అయ్యయ్యో! రాక్షసు లింకను వచ్చుచున్నారా? సేనానికోరిన విధమున నీవు రాణువను పంపితివా?.

మంత్రి—చిత్తము దేవా! వార్తవచ్చిన తత్క్షణమే ఒక మేటి సైన్యమును బంపితిని. ఇఁక నేటివార్తలు విన్నవించెద.

శత్రు—చెప్పుము చెప్పుము.

మంత్రి—దేవా! నేఁటియుదయము నుండియు రక్కసులు కదుపులు కదుపులుగ వచ్చుచున్నారఁట. అందొక కదుపుతో రక్షోనాయకుఁడగు తాళకేతుఁడనువాఁడు వచ్చి, "తపోవనముల నిర్మూలించి తద్వనవాసులను వధింపుఁ" డని తన యనుచరుల నాజ్ఞాపించెనఁట. వానియాజ్ఞకు లోఁబడి రాక్షసులు తపోవనములున్న యెడకుఁ బరువిడుచున్న వారఁట. ప్రస్తుతము మననగరమున కంటియున్న తపోవనమున సైతము వారలు ప్రవేశించి మౌనులను గారించుచున్నట్లు తెలియుచున్నది.

శత్రు—అక్కటా! ఎంతకష్ట మెంతకష్టము! వీరలవైఖరిఁ జూడ సింహమును దనగుహాయందే ఎదిరించిన గజసమూహము విధమున నున్నది. ఇఁక మేమును రణరంగమున కరుగవలెనా?

మంత్రి—దేవా! తామేలపోవలయును? ఈ సోఁకముూఁకను రూపుమాపుటకు యువరాజు చాలఁడో?

శత్రు—అట్లయిన విలంబముచేయక వానిని సమరసన్నద్ధునొనర్పుము. తపోవనవాసులకు భంగపాటు కల్గుచుండ మన ముపేక్షింపరాదు.

[అంతఁదెరలో రాక్షసనాదములు: మౌనుల ఆర్తధ్వనులు]

శత్రు—ఏమిటి దా కోలాహలము?

ప్రతీహారి—[పోయి వెండియువచ్చి] దేవా! రక్కసులబారికి వెఱచి తమ ఆకుటిళ్లను విడిచి పారిపోవుచున్న మునుల ఆర్తరవములు. వారిని హాహాధ్వనులతో రాక్షసులు వెంటఁ దఱుముచున్నారు.

శత్రు—ఏమిది? మనపురి చెంగటనే యిట్టి ఉపద్రవములా!
[ప్రతీహారితో] ఓరీ! నీవుపోయి ఋతధ్వజ కుమారుని శీఘ్రముగఁ దోడ్కొనిరమ్ము.

ప్రతీ—మహాప్రసాదము. [నిష్క్రమించును.

శత్రు—మంత్రీ! నీవు అప్రమత్తుఁడవై కర్తవ్యము నడపవలెను.

మంత్రి—దేవర ఆజ్ఞ.

[తెరలో దుందుభి. గాలవశిష్యుఁడొకఁడు ప్రవేశించును]

శిష్య—మానవేశ్వరా! మాగురువరులు గాలవమునీంద్రులు భవద్దర్శనమునకై వచ్చుచున్నారు.

శత్రు—[లేచి] అహా! నేఁడు సుదినము. (శిష్యు నుద్దేశించి) ఓయీ! వారెచ్చట?

శిష్య—(నిరూపించుచు) వీరే, కనుము.

[గాలవమహర్షి ప్రవేశించును]

శత్రు—(కని, మోఁకరించి) దేవా! నమస్కరించుచున్నాఁడను.

గాల—(ఆసీనుఁడై) శత్రుజిన్మహీపతీ! రాక్షసు లిప్పుడు తాళకేతుఁడను పాతాళాధిపుని ప్రాపుఁగొని చెలరేఁగి వనసీమలఁ బర్ణకుటీరవాసులయి తపమొనర్చుచున్న మాయట్టి మానులను మెండుగఁ బీడించుచుండుట నీవెఱింగిన విషయమే కదా?

శత్రు—మహాత్మా! అవును. ఇంతియకాక మూఁడుదినముల నుండియు మాసైన్యములు వారలతోఁ బోరుచునే యున్నవి. అహా! రజనిచరులు త్రిజగత్కంటకులు గదా?

గాల—వారల రావునకోర్వఁజాలక పెక్కండ్రుమునులు నీ వీటికిఁ గూఁతవేటు దూరముననున్న తమతమ కుటీర ముల నెత్తుకొని యెచ్చటికోపోయిరి. కొందఱు నాకడ కరు దెంచి తమకష్టములం దెలిపిరి. రాక్షస మర్దనమునకు నీ తన యుఁడు ఎంతయు సమర్థుఁడని విని వానిం దోడ్కొనిపోవ నే తెంచితిని. కావున నీవిప్పుడు ససైన్యుని ఋతధ్వజ కుమారుని నాతోడఁబంపవలయును.

శత్రు—మునివర్యా! కుమారుని రణసీమకు ఇపుడెట్లును బంప నిశ్చయించినాఁడను. వానిం దోడ్తెచ్చుటకై ప్రతీహారి యిప్పుడేపోయెను. వలయునేని వానిని మీ వెంటనే కొని పొండు. [నిర్వర్ణించి] ఇఁడుగో వచ్చుచున్నాఁడు.

[అంత ఋతుధ్వజుఁడు ప్రవేశించును.]

ఋత—[మోఁకరించి] జనకునకు ఋతిధ్వజుఁడు నమస్క రించుచున్నాఁడు. [అని మ్రొక్కు నే యును]

శత్రు—కళ్యాణము పుత్రా! కళ్యాణము. [నిరూపించుచు] కుమారా! గాలవమునీంద్రులు నీకై చనుదెంచినారు. వారికిఁ బ్రణామిల్లుము.

ఋత—[కని, సంతసముతో] ఆహా! అమోఘదర్శనులు! [అని సాగిలి మ్రొక్కును.]

గాల—కళ్యాణమస్తు. శత్రుజయసిద్ధిరస్తు.

శత్రు—కుమారా! వీరు నిన్ను రాక్షససంహారణార్థము తోడ్కొనిపోవ నరుదెంచినవారలు.

ఋత—అహో! ఎట్టి మహాకార్యము నావలన జరిపింపఁ జూచుచున్నారు! ఇట్టి విశేషగౌరవము మునీంద్రులు నాయెడఁజూపఁ గారణమేమి?

గాల—[దరహాసముతో] ఓయీ రాకుమారా!

సీ. వినుమిఁక; మూర్తిమంతయు న • నారతధర్మనియుక్తి నేలు నీ
జనకుఁడు శత్రుజిత్తు కడు • సాత్త్వికనాయకుఁ; డట్టివాని స
త్తనయుఁడవీవ; జంకెదు వే • ధర్మవిదూరుల రాక్షసాళి నే
ర్పునఁ గనుమాడ? ఇష్టమునుఁ • బ్రోచుట నీ కొక కష్టమౌనొకో!

ఋత—(స్వగతము) ఔరా! ఏమిభాగ్యము! మునిపీడనాలోలురగు దనుజుల సంహరించి నాజనకుని యశోలతికను నేను బోషింప వలసినకాల మాసన్నమాయెనుగదా? కాన సంశయింపనేల? (ప్రకాశము) మహానీయా! తప్పక నేను మీతో వచ్చెదను. మీయట్టి మహానుభావుల ప్రాపుండిన నాకెయ్యది అసాధ్యమగును?

శత్రు—కుమారా! నీవు రక్షోజనగర్వపాటన మొనర్చి నా కీర్తి గాపాడవలయు.

ఋత—పితృనానతి శిరసావహించెదను.

శత్రు—ఋషివర్యా! మీయాజ్ఞానుబద్ధుఁడనై మీతో నా కుమారుని ఋతధ్వజునిఁ బంపుచున్నాఁడను.

గాల—పరమానంద మొందితిని. నీకు సకలాభ్యుదయములు కల్గుఁగాత. [అనిలేచును. శత్రుజిత్తును, పరివారమును లేతురు.]

ఋత—(గాలవు నుద్దేశించి) మహాత్మా! మీయానతికి వేచి యున్నాఁడను.

గాల—కుమారా! రమ్ము. పోవుదము. [ఇర్వురు నిష్క్రమింతురు.

శత్రు—(మంత్రి నుద్దేశించి) అమాత్యా! మనమిప్పుడే ముని
చంద్రుని, గుమారుని వీడ్కొలుపవలయును. కాన సభ
నేఁటికిఁ జాలింతము. మఱియు, గుమారుని వెంటఁబంపు
టకు ఒక మహాసేనను నీవిప్పుడే ఆయత్తపఱుపవలయును.

మంత్రి—మహాప్రసాదము. [అందరు నిష్క్రమింతురు.

---

స్థలము—మునుపటిదే: రంగము - పురోపకంఠతపోవనము

[విశోకుఁడను నాగకుమారుఁడు ప్రవేశించును.]

విశో—దుష్టశిక్షణమ్మునకును, శిష్టపాలనమ్మునకును మానవయ
స్యుఁడు వీడు వెడలెనని యిచ్చటి మునీశ్వరులు చెప్పు
చున్నారు. మఱియు వారి మొగంబులు హర్షసూచక
ములై నేఁడు వికసించియున్నవి. ఇంత కొలఁదికాలములో
ఆశ్రమవనములందు మరలఁ బ్రశాంతి నెలకొనుటకుఁ
గారణమేమి? నామిత్రుఁడగు ఋతధ్వజ రాజకుమారుని
బెడిదంపుటడిదమే కదా? కనుఁడీ తపోవనలక్ష్మిని!

సీ. కడు వేడ్క మునిసతుల్ ♦ తడుపుచెంగావి వ
ల్వలఁ జెట్లపై నాఱ ♦ వైతురిచట
హోమధేనువుల పీ ♦ యూషతుల్యక్షీర
మునుదీయుదురు శిష్య ♦ జనములిచట
వేదపాఠమ్ము నే ♦ ర్పింతురంతేవాసి
వర్గమ్మునకు మౌని ♦ వర్యులిచట
శాస్త్రాంశములుకొన్ని ♦ చర్చింతురిదెవీరు
విద్వత్ప్రకర్షమ్ము ♦ వెలయనిచట

ఆశ్రమపుఁజిల్క లెంతయు ♦ హాయి గదుర
సామగానమ్ము నెడలేక ♦ సలుపు నిచట
ఇచట వటువులతో నాడు ♦ మృగము లౌర!
మోదరసపూర పూర్ణమ్మీత ♦ పోవనమ్ము.

[పరిక్రమించుచు] ఋతధ్వజుని నేఁడు చూడవలయు నను కుతూహలము నన్ను వదలకున్నది. [ఆకర్ణించుట నభినయించి] అదే, క్షతాంగులగు వీరులసుదిండ్ల ఆర్తనాదము. సమర రంగము ఉపకంఠముననే యుండవలయును. ఆవంకఁ జనెదనుగాక. [పరిక్రమించి] ఆహా! ఏమి రాక్షసకళేబరములు! [నిర్వర్ణించి] ఇఁడుగో ఘనాశ్వారూఢుండగు నామిత్రుఁడు! త్రిపురాసురమర్దన మొనర్చుచున్న రుద్రునిమాడ్కి రక్తసిక్తకరవాలమును గేలనూని అల్లసోఁకుమూఁకపై ప్రాల నురవడించుచున్నాఁడు! ఆహా! ఏమి యీతని రణోత్సాహము! [మరల నిర్వర్ణించి] అదే సంకులయుద్ధ మారంభమైనది. నావయస్యుని సేనలు ఎంత తేఁకువమై పోరాడుచున్నవో! [వెండియు నిర్వర్ణించి] ఆసోఁకుమూఁక నడుమఁగనఁబడు గంభీరవిగ్రహము తాళకేతుఁడు కాకుండునా? అదిగో! శత్రువర్గమును జిందఱవందఱయొనర్చి ఋతధ్వజుఁడు వాని వంకకే పరువిడుచున్నవాఁడు. ఇఁక ద్వంద్వయుద్ధ మొనర్తురు కాఁబోలు. సరియే, నేననుకొనినటులే. భళిభళి! నామిత్రుఁడు రక్షోవీరునితో ఎంత నేర్పునఁ బోరుచున్నాఁడు! ఆహా! ఇది యేమి? వారిరువురును ఇటువైపు వచ్చుచున్నారే? ఇఁక నేనిచటఁదడయరాదు. [ప్రాంజలియై] పరమేశ్వరా! నామిత్రునకు సమరజయ మనుగ్రహింపుము. ధర్మము స్థాపింపుము.

[అని ససంభ్రమముగా నిష్క్రమించును.

[తాళకేతుఁడు ప్రవేశించును. వానినిఁ దఱుముచు ఋతధ్వజుఁడు రక్తసిక్త కరవాలముతోఁ బ్రవేశించును.]

ఋత—[పేరెలుఁగుతో] ఓరీ! సాధుజనహంతా! ఎటకేఁగెదవు? నిలుము నిలుము.

ఉత్సాహము

నిలుము నిలుము నీచుఁడా! వి ♦ నీతిరహిత! నిన్నుఁ గఱ
బలము మెఱయఁదునిమి జముని ♦ పాలి కంపకుందు నే?
తులువ! మౌని వరులనీవు ♦ త్రుంచు టెంత? రమ్ము ర
మ్మలఁతి జోద! ఇపుడె నీదు ♦ నాగడములమాన్చెదన్.

తాళ—[నిరసనభావముతో] ఓరీ బేలా! నేను పారిపోవుచుంటినని కొంటివా! నీవలన నాకు భయమా?

శ్లో. భయమా? కాదు; మదేభముల్ కెనకు నా ♦ శ్వానంబు చందాన మ
ద్భయదాకారముఁ జూచి భీతిలక యీ ♦ బాలుండెదుర్కొ సమి
జ్జయ మర్దించుచుఁ బోరుకంటె మఱిన్నై ♦ చ్యంబున్న దే యంచు నిన్
దయమై వీడితిఁ; బొమ్ము; లేనియెడఁ గ్రో ♦ ధంబగ్గలంబౌఁజుమీ.

ఋత—[చిఱునగవుతోఁ దనలో] ఈ తుచ్ఛుఁడు నేను శత్రుజిద్రాజ సింహకిశోరముననిఁ యెఱుంగఁడు గాఁబోలు. [ప్రకాశము] ఓరీ ధూర్తుఁడా! మాటలతోఁ బ్రయోజనమేమి? నీయనుచరులఁ బెక్కండ్రఁ మదమడంచిన నాయసిపుత్రిక నీమెడఁగౌఁగిలింప సంబరపడుచున్నది. ఏమందువు?

తాళ—[కోపోద్దీపితుఁడై] అటులైన నిదె చచ్చితివి రమ్ము. [అని ఖడ్గము ఝళిపించెను.

ఋత—రారమ్ము. [అని యిరువురును యుద్ధము సేయుదురు. తాళకేతుఁడు నేలంబడి మరల లేచును.

తాళ—[ఆశ్చర్యముతో] ఔరా! ఏమి యీకుఱ్ఱని యుద్ధ
కౌశలము! వీనిని నే జయింపఁ జాలనిచో నాబ్రతుకేల?
[తేఁకువతోఁ బ్రకాశము] ఓయీ! నీవిదే అస్తమించితివి.
రారమ్ము.

ఋత—నేను కాదు. రాక్షసకుల మింతటితో నస్తమించును.

[ఇరువురు యుద్ధము చేయుదురు. తాళకేతుఁడు భీతిల్లి కిటిరూపము ధరించి పాతాళమున కరుగును.]

ఋత—[నిలువఁబడి, సాశ్చర్యము] ఔరా! ఏమి యాశ్చర్యము! నాధాటికి వెఱచియుఁ బరాజయమృత్యు భయమ్ము లొక్కుమ్మడి గలుగ,

క. కిటిరూపధారి యై యెం
తటిలో నహిపురికి నతి ము ♦ దంబందుచు నా
కుటిలుఁడు సనెఁ? హా! దైత్యులు
మటుమాయలమారులనెడి ♦ మాట యనృత మే?

అయినను వీనిని నిర్మూలింపక విడుతునా? ఇదె
వెన్నాడెద. [అని ససంభ్రమముగా నిష్క్రమించును.

# మదనసాయక

## ద్వితీయాంకము

స్థలము—పాతాళలోకము : రంగము-తాళకేతుని సౌధము

[మదనసాయక విచారముతోఁ బ్రవేశించును.]

మద—[విచారముతో] అకటా! ననుబోఁటి మందభాగ్య లెందైన నుందురా?

క. ఎక్కడి గంధర్వపురం?
బెక్కడి పాతాళలోక? ♦ మేగతి నిఁక నీ
రక్కసుల బారి తప్పును?
ముక్కడిదైవంబు వ్రాలుఁ ♦ పో యిది యహహా!

నాజీవితమంతయు స్వప్నగత వృత్తాంతమువలె నున్నది. దివిజనగు నాకు ఈ నాగలోకవాసమా? ఔరా! అసురుల దౌర్జన్యము! ఈ తాళకేతుహతకుఁడు నన్ను వరించునఁట! హా దైవమా! ఈ విచారమున కంతమెచ్చట?

[నతవదనయై నిటలము కేలిపైఁ జేర్చును.

[అంతఁ గుండల ప్రవేశించును.]

కుం—[నిర్వర్ణించి, ఆమెతో] చెలీ! మఱలఁ భ్రాంతదారినే త్రొక్కుచుంటివా?

మద—కుండలా! ఏల నన్నిట్లొంటరిగ విడిచిపోయితివి?

కుం—ఏమిట్లనుచున్నావు? నీవే కదా నన్ను ఆరామము శృంగారించి రమ్మని పంపినదానవు? నేనరుదెంచు సరికి నీవు సిద్ధముగా నుందునని చెప్పితివి. మఱచితివా?

మద—[తనలో] వనవిహారము సంగతి మఱవనే మఱచితిని. [ప్రకాశము] సకియా! నన్నుక్షమింపుము. నేఁడు వన విహారము నాకు వలదు.

కం—[తనలో] మగుడ శోకదేవత నుపాసించుటకు. [ప్రకాశము] చెలియా! నిన్ను నేనెఱుంగుదును. నేఁడు నిన్ను విడిచిపెట్టుదు ననుకొనకుము. మఱియు నీవు ఇన్నినాళ్లనుండియు నీరువోసి పెంచుచున్న చంపకలతికయు, మల్లికావల్లియుఁ గ్రొన్ననలెత్తి పుష్పాత్తులతో నీరాక కెదురు సూచుచున్నవి. నీవు రాకతీరునా?

మద—చెలీ! నీయాజ్ఞానుబద్ధను. కాని ఆయాసము కడుదుర్భరముగ నున్నది. ఒక్కసారి శయనించుట కనుజ్ఞనిమ్ము.

కం—నీసంగతి నాకుఁదెలియును. నీవు శయనింపవు.

మద—నెచ్చెలీ! నీయాన.

కం—అటులైన నొకనూఱు శయనింపుము. ఇంతలో నేను బోయి నీయుడుపులును, భూషణమ్ములును గొనివచ్చెద.

మద—అట్లే సఖీ [కంఠల నిష్క్రమించును.

మద—ఔరా! ఈమేరునగపుత్రి నన్నెపుడు నెడఁబాయక నాకొనర్చుచున్న సంరక్షణము నెట్లు వాక్రుత్తును? ఆ హతవిధి ఈమెను నన్నుఁజేర్చకపోయెనేని నాగతి యేమై యుండునో? [వామకరస్పందము సూచించుచు] ఏమిది? నాయెడమభుజ మదరుచున్నదే? ఈమందభాగధేయకుఁ గల్గు మంగళం బెయ్యది?

[అంత నాకాశమున]

గీ. తరుణి! పెడఁబాయఁ బోకుము ♦ ధైర్యనాక;
ప్రియసఖీవ్యాజ విరహిత ♦ ప్రేమ మనెడి
మేటి చుక్కాని నేరుపు ♦ మెయి విపత్స
రిత్పతిఁ వేగ నీ వుత్త ♦ రింపఁ గలవు.

క. శక్ర నిభమూర్తి యతుల ప
రాక్రమవంతుండునైన ♦ రాకొమరుఁడిదే
ఆ క్రూరునిఁ జెండాడ న
వక్రచరిత! వచ్చు; సౌఖ్య ♦ వైభవ మిచ్చుఁ.

మద—[అచ్చెరువుతో] ఏమి యాశ్చర్యము! నాకు సౌఖ్య మబ్బుటయా? నేనునమ్మఁ జాలను. ఈ గగనముపల్కు గగనకుసుమమే. అయ్యో కండలా! నీవు ఇట్టి తఱి నాకడ నుండఁగూడదా? మఱచితిని. ఆమె వచ్చువఱకును నేను ఇక్లో యుండిన ఆమె నన్నుఁదప్పక నిందించును. ఇఁక శయనించెద. [అని యట్లుసేయును

[అంత ఋతధ్వజుఁడు ప్రవేశించును.]

ఋత—ఆ మాయాదంష్ట్రి పట్టిపోయిన మార్గమిదియే. నేనెచ్చటి కేతెంచితిని? [నలుకెలంకులఁబరికించి] ఏమిది? దివ్యభవనమువలెఁ దోఁచుచున్నదే? ఈ స్వర్ణగృహ మెవ్వరిదై యుండనోపు? [మగుడఁబరికించి] అబ్బా! ఏమి యిచ్చటి కాంతి యుత్కర్షము!

సీ. బంగారు తీవె లా ♦ గం గల్గి యందమ్ము
మించెడి హొంబట్టు ♦ మేలుకట్టు
జ్యోతిలేకయె వింత ♦ జ్యోత్స్న గొల్పెడు మణి
స్థగిత మా దీపికా ♦ స్తంభచయము

రమ్మంచుఁ గౌఁగిలి ♦ నిమ్మంచు లే నవ్వ
గదుర సైఁగ లానర్చు ♦ నాదరి బావలు
ముకురమ్మునన్ బోలె ♦ మూర్తిం బ్రతిఫలింపఁ
గాఁ జేయు చల్వరా ♦ కట్టు నేల
కొలుపు బలువితముల రుమల్ ♦ కలసి కాంత
వెలుఁగు వెలువ కా నిరుల్ ♦ దొలఁగ ద్ర
నిలుపు నీయెడ నిత్య చం ♦ ద్రికల నార!
చెలువముల సీమ యీ గృహ ♦ శ్రీలలామ.

ఈకాంచన హార్మ్యము నిక్కముగ రక్కసునిచే నిర్మింపఁబడినదే. వాఁడిందెచ్చటనైన డాఁగియుండవలెను. కాన వెదకి చూచెద. [పరిక్రమించుచు, మదనసాయకం గాంచి] ఆహా! ఎవరీ చిన్నది? ఇందొంటిరిగా నిదురించుచున్నదే? [మగుడఁబరికించి] ఈమె ఏజాతికన్యయైయుండును?

ఆ. నాగకన్యయొక్కొ? ♦ నరకన్యయొకొ? దేవ
కన్యయొక్కొ? ఖచర ♦ కన్యయొక్కొ?
నన్ను మోహపఱుప ♦ నక్తంచరుఁడు సృష్టి
చేసి నట్టి గడుసు ♦ చేడె యొక్కొ?

[దరికిఁబోయి చూచి] ఔరా! ఏమి యంగసౌష్ఠవము! ఈసుకుమారి నిదురించియు ఎంతముద్దులు గుల్కుచున్నది!

సీ. వెడవింటివాఁడు బు ♦ ద్ధిన నిటంబడి కడుఁ
మురువుఁ జూపెడు పూవు ♦ ముల్కియే మొ?
లోకత్రయంబు నల ♦ వోక జయింప నే
తెంచిన మోహినీ ♦ దేవియే మొ?
సకలలోకా మోద ♦ సంధాయిని యటంచుఁ
బేర్గన్న గాంధర్వ ♦ విద్యయే మొ?
మురిపె మొప్పఁగ లస ♦ న్మూర్తిఁ దా వహియించి
రాజిల్లు శృంగార ♦ రసమ యే మొ?

అనుచుఁ జూపులు మరిఁ గొని ♦ యూడఁదగిన
రూప రేఖావిలాసంపుఁ ♦ బ్రోవనంగఁ
బొదలు నీ విభ్రమోజ్జ్వల ♦ మోహనాంగి;
దీని చందంబదేమొకో ♦ తెలియరాదు.

[మదనసాయక మెదలును. దానినిఁగని ఋత.] ఈ సుదతి కదలుచున్నది. నిద్ర లేచును గాఁబోలు.

[అని యొకవంక నిలుచును.

మద—[లేచి, పాఱఁజూచి] ఇచ్చట అలికిడికిఁ గారణమేమి? నెచ్చెలి యరుదెంచెనా? కుండలా! కుండలా! (పలుకదు) ఆమె యింకను రాలేదు. లేక రాత్రికేళ్ల వి భటులెవ్వరైన వచ్చిరా? నాకుభయమగు చున్నది. [నలువైపులఁజూచి, ఋతధ్వజునిఁగాంచి, లేచి, సాశ్చర్యము] ఆహా! ఎవరీ దివ్యసుందరమూర్తి? ఇది విభ్రమమా? నిజమా?

ఋత—[ఆమెమోమును దేటిచూచి] ఏమిది? కుంజదోఁచెడు కెందమ్మి వదువుఁ గాంతిదక్కు యీమె నెమ్మొగమున బాష్పధారా రేఖలు కప్పుట్టుచున్నవి? నిక్కముగ ఈమె రాజసాపహృతియగు ఒక కన్యకామణి గావలయును.

మద—[ముగుడ పతినిఁగాంచి, సంతోషముతో] గగనవాణి యుదాహరించిన రాజకుమారుఁడు ఇతఁడేయైయుండ నోపు. కాని యీమోహనమూర్తిని జూచిన నామేను వివశమగుచున్నది. కుండల రాదేమి? కుండలా! కుండలా!

ఋత—అయ్యో! ఈముద్దరాలు మిక్కిలి భయపడుచు సహచరిని గాఁబోలు పిలుచుచున్నది. వృత్తమరయుటకు

నేనీమెను సమీపించినచోఁ దప్పక బిడియపడును. అయి
నను జూచెదను. [డాసి]

పంచచామరము. భయంబు పడంగ నేల? బేల! ♦ వద్దు; నవ్విలాంగనే
దయన్ వచింపుమా పలాశి ♦ ధార్ష్ట్యముల్ సుభాషిణీ!

మద—[మిక్కిలి బిడియము నటింపుచు] అబ్బా! ఈమోహ
నాకారుని యెదుట నేనిఁక నిలువఁజాలను. కుండలరాదు.
నేనే అమెవద్ద కేఁగెదను. [అని నిష్క్రమించును.

ఋత—

అయో! మృగాక్షి మాఱుమాట ♦ నాడ కేడ కేఁగె? వి
స్మయమ్ము గొల్పునౌర! ఈమె ♦ చంద; మేమి సేయుదున్?

అవురా! ఏమి యీమె మాహాత్మ్యము! ప్రత్యక్షమైన
మీయక క్రొక్కారు మెఱుంగుభంగి అంగనామణి మాయ
మైనది. [కొంత తడవాఁగి] సరియే. వాస్తవముగ ఇది తాళ
కేతునిచే నిర్మింపఁబడిన మాయాసౌధము. ఆ టక్కులాంకరిని
ఎట్లయినఁగనుంగొని వధించినచో అన్నియుఁ జక్కఁబడును.
వానికై అందంద వెదకిచూచెద. [అని నిష్క్రమించును.

స్థలము—మునుపటిదే: రంగము —సౌధాంతికోద్యానము.

[చంద్రకాంతవేదికపై విరహతాపము నటించుచు మదనసాయ
కయు, ఆమెయండఁ గుండలయు బ్రవేశింతురు.]

కుండ—[స్వగతము] ఎడఁబాసియున్నది ఒక్కక్షణిమే. ఇం
తలో ఈమెకిన్ని మార్పులు. అహో! దైవకైతవము! ఆ
దివ్యపురుషుఁడెవఁడై యుండును? [మద.తో] చెలీ! మదన
సాయకా! కలఁతనిదురలో నీవు ఏదో కలఁగని యుంద్దువు.

కాని ఆగుర్గమస్థలంబునకు మనుష్యమాత్రుఁడు రాఁగలుగు టెట్లు ?

మద—ఓసీ! నీవెంత చెప్పినను నమ్మను. నేనేమిసేయుదును ? ఆ మోహనరూపుని ఆకృతి నాకిపుడు కన్నులకుఁ గట్టి నట్లున్నది. అతని పలుకులు ఇపుడు నావీనులఁ దాండవ మాడుచున్నవి.

కుండ—అతఁడు ఎవ్వఁడో ఎచ్చటనుండునో ఎవరికెఱుక ? అట్టివానినిఁ గని నీవు మోహింపవచ్చునా? ఓసీ బాలా! నీ వెంతగోలవు? నిన్నుఁ జూచిన ఉషాకన్య స్ఫురణకు వచ్చుచున్నది.

మద—చెలీ! అటులైన సంతోషమే. నీవు చిత్రరేఖవుగదా?

కుండ—చతురసంభాషణమునకుఁ గొదవేమి ? సఖీ ! అతఁ డెట్లుండునో ఇంచుక వర్ణింపఁగలవా ?

మద—ఆ యనుపమాంగుని నేను వర్ణింపఁజాలను. అయినను వాని విధమిట్లున్నది.

[గేయము]

సఖీ! విను - మోహనాంగుఁడే

1 తలపై మకుటము - కలిగిన వాఁడే
చెలువగు తిలకము వాఁడే ॥స॥

2 ధనువును దోనయును - దాలిచినాఁడే
మనసిజుఁ బోలినవాఁడే ॥స॥

కుండ—[తనలో] ఈమె చెప్పినచొప్పు నిక్కువమేని అతఁడు తాళకేతునిఁ జంప నరుదెంచిన యొకశూరశిఖామణి గావలయు. చాలకాలమునుండియు ఆమొఱకుని జాడయే

లేదు. మింటిపల్కు సార్థకము కావచ్చును. [ప్రకాశము] సుందరీ! అతఁడు కార్యార్థియై వచ్చినాఁడు. కావున ఎట్టు లైనను మరల మనసౌధమునకు రాఁగలఁడు. నీవూఱ డిల్లుము.

మద—[విరాళితో] సకియా! నీవా మదనసుందరుని ఎట్టులైనఁ దోడ్తేనిచో నేను తనువు నిలుపఁజాలను. అట్టి సుందరుని నాప్రేమలతికతో బంధింపఁగలిగినప్పుడుకదా నా జవ్వ నము సార్థకమగును?

[గేయము]

కోమలదేహుం, డును సుకుమారుం, డగు నా పురుషుం, డెవఁడో చెలియా!
ప్రేమమలర నిపు, డతమొయిఁగనుఁగొని, ప్రియసఖి! వేగము, తెలుపఁగదే
అతనుఁడదయుఁ డయ్యెఁగా! హా! సహింపఁ జాల నే!
ఈ ప్రమద వనాంతమున కొక్కసారి యరుగు దేరా!
నిన్నుఁ గోరియున్నరమణిఁ జేరదీయ నౌరా!
ప్రాణేశ! నిన్నుఁ జూడ కున్నఁ బ్రాణమేదురా!
హాహా! మదనుని, సుమబాణములకు, నా హృదయమ్ము దహించుఁ జెలీ!

[అనిసోలి చెలిపైఁ బడును.

కుండ—[స్వగతము] అన్నా! ఈ సుందరి మనస్సు ఆదివ్య పురుషునియందే లగ్నమయియున్నదే? కడునసాధ్యము. [ఆమెనుగౌఁగిలించి] చెలీ! సమాశ్వసిల్లుము సమాశ్వ సిల్లుము. నీవు చెప్పిన రాజకుమారుఁడు తాళకేతుని దును మాడక మరలిపోవఁడు. అయినను అతఁడెవ్వఁడో కనుం గొని నీయొద్దకుఁ దోడ్తెచ్చెదను. నీవుదీనికింతగా వగవనేల? ఊఱడిల్లుము. [అనుచు నామెను పైఁటచెంగుతో విసరును.

మద—[ తేఱి] నేను నమ్మఁజాలను సఖి! ఆమనోహరాంగుని మరలఁ గాంచెడి భాగ్యము నాయీపాపిష్ఠ నేత్రములకుఁ కలుగను. అయ్యయ్యో! పాడులజ్జ! అతని ప్రియవచనములకు ఒక్క మాటయైన బదులాడకుండఁ జేసినది!

కుండ—ఏమీ యధైర్యమే చెలీ! నీవట్లే అనుకొననేల? నిన్ను మోహించి అతఁడు మాత్రము విరాళినొందకుండునా?

మద—ఊరకుండుము. ఈమందభాగ్య కంతటిపుణ్యమా?

కుండ—[ఊర్ధ్వమవలోకించి] అప్పుడే ప్రొద్దు గ్రుంకుచున్నది. [చెలితో] మదనసాయకా! మనమిఁక ఇంటికి మరలుదము.

[పైకి నిరూపించి] చూడుము.

గీ. వచ్చి రిరేచరుండింక; ♦ ముచ్చిలించు
నాగు వసు; విటఁ దడయంగ ♦ రాదటంచుఁ
దెనగు వసుకోటి యెల్ల గు ♦ ప్తమ్ము చేసి
తిగలు రవిపాంథుఁడి - తత్ప ♦ థమ్ముఁబాసి.

లెమ్ము పోవుదము. [అని లేచును.

మద—[లేచుచు బూర్వదిక్కుఁగని] చెలీ! ఆకనఁబడుచున్న అగ్నిమండలమేమియో చెప్పుము. అస్తమించుచున్న సూర్యుఁడా?

కుండ—[దరహాసముతో, స్వగతము] ఓహో! చంద్రమండలమీమె కప్పుడే అహితమైనది. ఇదియు నొక విరహతాపసూచకమే కదా? (ప్రకాశము) సకియా! అది తూర్పు దిక్కు. మఱియు నతఁడు,

గీ. పాల్కడలి వెన్న; అమృతంపు ♦ బావి; సకల
భువన హర్షాను సంధాయి ♦ పువ్వుఁబోఁడి!
తలిరు విలుకాని చెలికాఁడి ♦ తండ్రి; మాకు
శీతకరుఁడు పో; నీకు ని ♦ శాత కరుఁడు.

రమ్ము రమ్ము. పోవుదము. [ఇద్దరునిష్క్రమింతురు.
మద— చెలీ అటులే.

స్థలము—తపోవనము : రంగము—గాలవమున్యాశ్రమము.

[గాలవమహర్షి ప్రవేశించును]

గాల—[వ్యసనముతో] నేననుకొనినట్లే అయినది. యామినీచరులెల్లరు కామరూపులే. వారలలో ఈ తాళకేతు పాతకుఁడు కడుజిత్తులమారి. అట్లుకానిచో ఋతధ్వజుని చంద్రహాస మింతకుముందే యితని కంఠరుధిరమును జవిఁగొనక యుండునా? ఇప్పుడైనను ఋతధ్వజుఁడు నాపనుపున మరల నాగలోకమునకుఁ బోయి అచట నేఁజెప్పిన అశ్వత్థుఁడను నాగరాజును సందర్శించును. అతఁడు దివ్యప్రభావుఁడును, ఇతనితండ్రికిఁ బ్రాణమిత్రుఁడును కావునఁ దన దివ్యజ్ఞానశక్తిచే తాళకేతుఁడు దాఁగియున్న జాడ ఋతధ్వజునకుఁ జెప్పును. ఈసింహకిశోరము ఆరక్షోమదేభమును దప్పక విదళించి గెలుచును. ఇంతకుమించి కావలసినదేమి? కాని ఆరక్షోనాయకుని సౌధమున ఋతధ్వజుఁడు తాను జూచితినని చెప్పిన ఆ చిన్నది ఎవ్వరో?

(అని యోజింపుచుండఁ దెరలో "అఖిలలోకేశ్వరీ!" అనుధ్వని)

గాల—[తెరవంకఁగని] ఎవరా వచ్చుచున్నది? ఋషివేషధారియగు నొక గాయకుఁడు. నారదమునీంద్రులా?

[అంతఁదుంబురుఁడు వీణె మీటుచుఁ బ్రవేశించును.]

[గేయము] 1. నిఖిలలోకేశ్వరీ! నిత్యకళ్యాణి! నత
మఖభుగిన మకుటరుచి ♦ మండిత పదాంబురుహా!
2. శైలరాట్సుత! మహా ♦ సౌఖ్య శాంతిప్రదా!
కాళీ! సద్భక్తజన ♦ కల్పవల్లీ! శివా!

గాల—[వానింగని అచ్చెరువుఁతో, దనలో] అహో! నేఁడెట్టి సుదినము! తుంబురులరుదెంచిరే? ధన్యోస్మి ధన్యోస్మి! [ప్రకాశము] దేవమహర్షీ! దయచేయుఁడు. ఈపీఠము నలంకరింపుఁడు.

తుం—[ఆసీనుఁడగును]

గాల—మహాత్మా! తమరాకకుఁ గారణమేమి?

తుం—మునీశ్వరా! నాగలోకమునకుఁబోవు నుద్దేశముతో నేనిప్పుడు వచ్చుచున్నాఁడను. [కేతకీదళముదీసి వానిచేత నుంచి] దీనినిఁ గనుము.

గాల—["గురువర! ఏడనున్న" అనుపద్యముఁ జదివి తనలో] వియచ్చరులకు నాగలోక వాసమబ్బుటకుఁ గారణమేమి? త్రిలోకకంటకుఁడా కాళకేతుఁడు ఎవ్వరినైన బ్రముచ్చిలి తోడ్తెచ్చి యుండవలెను. [ప్రకాశము] మహాత్మా! రక్షోజన కోలాహలముతో నిండియున్న నాగలోకము నకుఁ దామిట్టితఱి నరుగుచున్నారు.

తుం—అవును. ఎటులైనఁబోయి ఆలేకరి యెవరో తెలిసి కొనవలెను. మఱియు విశ్వావసుఁడను నొక గంధర్వ రాజు కొమార్తె రాక్షసాపహృతయై నాగలోకమున

నున్నట్లు తెలియవచ్చెను. ఆమె యుదంతముకూడ నేను తెలిసికొనవలసి యున్నది.

గాల—[తనలో] ఋతధ్వజుఁడా హేమగృహమందుఁ గాంచిన కన్యామణి ఈమెయే కావలయును.

తాం—మునివర్యా! ఋతధ్వజుఁడను రాజకుమారుఁడు ఒక మహర్షి సాయముచే రాక్షసులను సంహరించుచున్నాఁ డని వింటిని. ఆమహర్షి నామం బేమి?

గాల—[తనలో] అయ్యో! ఈమహాత్ముఁడు నన్నెఱుఁగఁడు. [ప్రకాశము] మహాత్మా! గాలవుఁడు.

తుం—వానిని జూచుటకై ఈ తపోవనవాటి కరుదెంచితిని. అతఁ డెచ్చట నున్నవాఁడు?

గాల—[దరహాసముతో] మహాత్మా! తమ సముఖమున నే. నేనే గాలవుఁడను.

తుం—[అచ్చెరువుతో, కౌఁగిలించి] మహనీయా! క్షమింపుము. నేను తమ్ము నెన్నఁడునుజూచి యుండలేను. ఇఁక నా కార్యములు ఫలించినట్లే.

గాల—మహాత్మా! మీదయకై కృతజ్ఞుఁడను. తాము భోగిపురి జేరునప్పటికి ఋతధ్వజుఁడు రక్షోనాయకుని దును మాడును. రాక్షస నిర్మితమగు నొక హేమగృహమున దాముదాచిన కన్యామణి యుండనోవు.

తుం—సంతోషము సంతోషము. నేఁడు కడుసుదినము. ఇఁక నేను బోయివచ్చెద.

గాల—ఆమెను దోడ్కొని తాము మరల నొకసారి నాయాశ్రమమున కరుదేరఁ బ్రార్థించుచున్నాఁడను.

తుం—తప్పక-తప్పక తోడ్కొనివచ్చెదను. నేఁబోవు చున్నాఁడను.

[అని "నిఖిలలోకేశ్వరీ!" అని పాడుచు నిష్క్రమించును.

గాల—[కొంతవడి నిలిచి, ఉత్సాహముతో] సేబాసు! బాగుగ నున్నది.

క. వే వచ్చు బుతధ్వజుఁ డిపు
డే వానినిఁ దునిమి; ఆమె • నితఁ డారసి తో
డే వచ్చును; వారిని సం
భావించు విధమ్ము నాకు • స్పష్టంబాయెన్.

నా సంతోషము తక్కుంగల మునిపుంగవుల కెఱింగింప వలెను. ఇదెపోయెద. [అని నిష్క్రమించును.

స్థలము — నాగలోకము : రంగము — అరణ్యము.

[తూర్యకేతుఁడు పథిక వేషధారియై యొక గుహయెదుట నాసీనుఁడగును.]

తూర్య—ఈకుఱ్ఱఁడెవ్వఁడో మనుష్యమాత్రుఁడు కాఁడు. అయినచోఁ ద్రిజగద్భీషణుఁడగు నాయన్నకు ఈగతియేల కల్గును! మునులందఱును ఇతనిని మర్త్యలోకేశ్వరుని పట్టియని అభినందింతురు. కాని యితఁడు వారల తపః ఫలంబనుకొనియెదను. [ఎడమకన్నదరుట సూచించి] ఓసీ వామనేత్రమా! అనుభవింప సిద్ధముగనున్న దుస్థితిని నీవు వెండియు సూచింపనేల? ఇఁక నీగండము తప్పుట బహు

కష్టము. నాయన్నయు ధైర్యము దక్కియున్నవాఁడు. ఆసింహకిశోర మీగుహకు రాకుండునా?

[అంత ఋతధ్వజుఁడును, విశోకుఁడును ప్రవేశింతురు.]

తూర్య—ఇదె వచ్చినాఁడు. నేను విశ్రమించుట నభినయించెదను. [అని యట్లు సేయును.

విశో—[ఋత.తో] మిత్రమా! జనకుఁడు చెప్పిన అరణ్యమునకే మనమిప్పుడరుదెంచితిమి. [నిరూపించి] ఆకనఁబడు నదియే తాళకేతుఁడు డాఁగియున్న మాయాగుహ యనుకొందును. [వెండియు నిరూపించి] వయస్యా! కనుము కనుమా గుహాద్వారము నొద్దఁ గావలియున్న మాయాపథికుని.

ఋత—ఈమాయావిగూ కాఁబోలు వాని తమ్ముఁడగు తూర్యకేతుఁడనువాఁడు?

విశో—సందియమేమి? జనకుఁడు మనకల్లేకదా చెప్పెను? నీవతనిని వంచించి లోనికరిగితివేని అందు నిజరూపమున దాఁగియున్న తాళకేతుఁడు నీచేతఁజచ్చినవాఁడే. మిత్రమా! నేను బోయెదను. నీవు కర్తవ్యము నడపుము.

[విశోకుఁడు నిష్క్రమించును.

ఋత—[తనలో] వీని నేయుపాయముచేనైన వంచింపవలయును. [తెలిసి, ప్రకాశము] అయ్యా! మీరెవరు?

తూర్య—నేను బాటసారిని.

ఋత—మీ దేశం బెద్ది?

తూర్య—నా దేశము కడుదూరమున నున్నది. మీకిచట నేమి కావలయును?

ఋత—[చిరునగవుతో] అయ్యా! నేనును దూర దేశము నుండియే వచ్చుచున్నాఁడను. మిక్కిలి అలసితిని. మీతోడ నేనును శయనింపవచ్చునా?

సూర్య—వలదు వలదు. మీరు సుకుమారులగు రాజపుత్రుల వలెఁ దోఁచుచున్నారు. మీరీ వనమున విశ్రమించుటకు అనువగుస్థలము నేను చూపింపఁగలను. నాతోడ వత్తురా?

ఋత—వలదు. నాకయి మీరేల శ్రమపడవలయును? అయ్యా! మీప్రయాణసామగ్రి ఈగుహయందుంచితిరేమి?

సూర్య—[వెల్లఁబడి] లేదు లేదు. నాకును భయమగుచున్నది. ఇందొక దుష్ట మృగమున్నటులు దోఁచుచున్నది. మన మిచట నిలువరాదు. పోదము పదండు.

[అని యతనినిఁ జేయిబట్టిలాఁగును.

ఋత—[చెయివిదల్చుకొని] అయినచో దానిని సంహరించి వచ్చెదను. మీరిచ్చటనే నిలుండు. [అని గుహలోని కరుగును.

సూర్య—రాక్షస కులమునకు అవసానకాలము దాపరించినది. పాపఫల మనుభవింపక తీఱునా?

ఉ. సాధుల సన్మునీశ్వరులఁ ♦ జంపిన పాపము, మానికొంతలన్
బాధలఁ బెట్టి బిట్టు చెఱ ♦ పట్టిన పాపము, నెల్లరన్ మను
ష్యాధములంచుఁ జిత్రవధ ♦ సల్పిన పాపము, రిత్తవోవు నే?
సాధన మేమి? అన్న యమ ♦ సన్నిధి కేఁగుట సిద్ధ మియ్యెడన్.

[అని మెలుఁగత్తి]అన్నా! చచ్చితివి. [అని నిష్క్రమించును.

[గుహలోఁ గలకలము. ద్వంద్వయుద్ధ సంభ్రమము]

ఋుత—[రక్తసిక్త కరవాలముతోఁ బ్రవేశించి] ధూర్తుఁడు మడిసినాఁడు. ఇంతటితో రాక్షసధార్త్యము లంతరించి నటులే. ఈయుదంతము గాలవ మునీంద్రుల కెఱిఁగింప వలయు. [అని ససంభ్రమముగా నిష్క్రమించును.

స్థలము—మునుపటిదే : రంగము—తాళకేతుని సౌధము.
[మదనసాయక ప్రవేశించును.]

మద—నామనమున సంతోష విషాదములు పెనఁగొని యున్నవి.

గీ. క్రూరదైత్యుని మన్మన ♦ శ్చోరుఁ డెలమిఁ
జంపె నని పది యెంతయు ♦ సంబ్రమందు;
మఱియుఁ బనిదీఱెనని తాను ♦ మరలి పోవు
నో యటంచును దత్తఱ ♦ మొందు మనము.

దైత్యనాయకుఁడు సంహారింపఁబడుట కేమి ? కుండల యనినట్లు మాకిపుడు దయామయుఁడగు అశ్వస్థుని సమాదర ణము లభించు టే గొప్పశుభము. మఱియు, నేఁడ దేమియో కాని,

గీ. సరవిఁ బెంపుడు చిల్కలు ♦ శారికలును
బాడుచున్నవి వేడ్కలో; ♦ భవనమందు
నిండు దోఁచెడు; మద్వామ ♦ నేత్రమదరు
చున్న దిప్పు; డదేమి కా ♦ నున్న దొక్కొ? • •

కుండల—[దడ దడ ప్రవేశించి] ధన్యలముసఖీ! మన జాబు ఫలించినది. తుంబురు లరుదెంచినారు.

మద—[అచ్చెరువుతో] నిజమే? ఏమిచిత్రము! వారెచ్చట?

కుం—[నిరూపించుచు] వీరే, కనుము.

[అంతఁ దుంబురుఁడు ప్రవేశించును.]

మద—[వినమ్రయై] గురువర్యా! నమస్కారము.

తుంబు—కళ్యాణము బిడ్డా! కళ్యాణము.

కుండల—మీయమోఘ వచనము శీఘ్రముగానే సఫల మగుఁగాక. మహనీయా! ఈ పీఠము నలంకరింపుఁడు.

[తుంబురుఁడాసీనుఁడగును.

మద—[చెలితో] సఖీ! వీరినిఁజూడ నాజనకుని జూచిన ట్లున్నది.

కుం—ఇతఁడు నీతలిదండ్రులను జూచియే వచ్చినాఁడు.

మద—[తుంబురు నుద్దేశించి] గురువర్యా! నాజననీ జనకులకు సేమమా?

తుం—అవును. వారు క్షేమముగానే యున్నారు.

మద—[బాష్పనయనయై] నన్నెప్పుడైనఁ దలంతురా?

తుం—బాలా! ఏమి యిట్లనెదవు? నిన్నే తలఁచుకొనుచు అమితశోకమున ఇద్దరును మూలపట్టినారు. ముఖ్యముగ నీ జనని,

గీ. తనకనుంగవ నీరు సం ♦ ద్రమ్ము గాఁగ
మేను యానముగాఁ దాని ♦ పైనిఁ గోలి
యాడెడుఁ; గడింది నిట్టూర్పు ♦ లను తుపాను
గాలులకు నామె యేమి కాఁ ♦ గలదో యింక?

ఇంతలో మీరు పంపిన కమ్మ నందికొని వారికడ కరిగితిని. నీతండ్రి దానింజూచి అడుగునఁ గుండల చిహ్నముండు

టచే నీచెలికత్తె పంపెననియే ఊహించినాఁడు. మీసేవ మఁగసి వచ్చెదనని నేనిచ్చటికి వచ్చుచుండఁ దాళకేతుఁడు ఋతధ్వజుఁడను ఒక రాజకుమారునిచే మడిసెనను వృత్తాంతము త్రోవలో నాకర్ణించితిని. నేనిచ్చటికివచ్చి మీరిరువురును ఒక నాగరాజు సంరక్షణమున క్షేమముగ నున్నారను సంతోషపు వార్తయు వింటిని. అతని కుమారుఁడే నన్నిచ్చటికిఁ దోడ్కొని వచ్చినాఁడు. నాకన్నులు చల్లగ మిమ్ముల నిరువురను జూడఁగల్గితిని. నాఆగమనము సఫలీకృతమైనది. నేఁడు కడు సుదినము.

మద—[తనలో] ఔరా! ఏమివున్నము! నిక్కముగఁ దాళకేతునిఁ జంపిన రాజకుమారుఁడు నేను జూచిన యతఁడే. [చెలితో] కుండలా! అసురనాయకునిఁ జంపిన ఆ రాజకుమారుని వృత్తాంతము వీరినేల యడుగవు?

కుం—సఖీ! నీవుంకుము. నేనంతయు అప్పుడే తెలిసికొంటిని. నీకు వెనుకఁ జెప్పెదనులే.

మద—సఖీ! నీ యిష్టము.

తుం—బిడ్డలారా! మన మిఁకఁ బ్రయాణమై మనలోకమునకుఁ బోవుదమా?

కుం—అట్లే యొనర్తము. కాని యీదినములలో మన మీలోకమును నిరపాయముగ దాఁటి యేఁగఁగలమో?

తుం—ఏఁగకేమి? పుత్రీ!

గీ. త్రిభువనమ్ముల మును స్వ[illegible] ♦ రించినట్టి
దైవతారాతి మాయాంధ ♦ తమస మిపుడు

చండమూర్తి ఋతధ్వజా • ర్కుండు వాఁడమఁ
గచ్చువిచ్చయ్యె; భయమేమి • కల్గు మనకు ?

వినుము. మన మిచ్చటనుండి బయలుదేఱి మర్త్య లోకమున గాలవుఁడను నొక మహర్షి ఆశ్రమమున విడియు దము. సత్ప్రభావుఁడగు ఈ గాలవుఁడే తొల్లి ఋతధ్వజునకు మూఁడు లోకములు దాఁటగల "కువలయాశ్వము" ను సృజించి యిచ్చినాఁడు. ఇతఁడు మనల నెంతయు నాదరించును. వెనుక మనపురి కరుగవచ్చును. మన మిఁక బయలుదేఱు టయే కర్తవ్యము.

కుం—గురువరు నాజ్ఞ. అట్లే కానిండు. [తెరవంకఁగని]
ఇఁడుగో అశ్వస్థుఁడు! మాపాలిఁటి భాగ్యదేవత!

[అంత నశ్వస్థుఁడు ప్రవేశించును.]

అశ్వ—[తుంబురు నుద్దేశించి] మహానీయా! నన్నుఁ క్షమింప వలయును. నేను పూజాదీక్షనుండఁగాఁ దాము విచ్చేసి నారని వింటిని. బిడ్డలనుఁ జూచుటకుఁ దాము మిగుల నాత్రముతో నుందురని మావిశోకునిఁ దెషుతోఁ బంపి తిని. చూచితిరా మీబిడ్డలను?

తుం—చూడ కేమి? నేఁటి కీభాగ్యము నీకరుణచేత నేకదా కల్గినది?

అశ్వ—కుండలు పంపిన జాబు తమకందియుండునని తలంచెద.

తుం—అదియే నన్ను ఈయెడకు రావించినది. అనితర సాధ్య మగు ఆపని అట్టి విషమదినములలో నీకుమారుఁడు పూనకున్న నాకీభాగ్య మున్నదై నఁ గల్గునా? "పరోప

కారార్థ మిదంశరీర" మ్మను ఆర్యోక్తిని బాలించుటకే కాఁబోలు నీసత్కుటుంబ మవతరించినది ?

అశ్వ—మహాత్మా ! ఏమియిట్లందురు ? నావిధియే నేనాచరించుచుంటిని.

సోం—మహోపకారులు ఇట్లేయందురు. కాని నాగాధిపా ! నేఁడు మాసంతోషమునకు మేర లేదు. నీఋణ మెవ్వరును దీర్పలేరు. వీరిని నా వెంటఁ దోడ్కొని పోవుటకిఁక ననుజ్ఞయేనా ?

అశ్వ—మీబిడ్డలేకదా? నాయనుజ్ఞ కావలయునే? అవశ్యముగఁ దోడ్కొని పొండు.

కుం—అయ్యో? ఎట్లు పోఁగలుగుదుము? నీకు మే ముపకార బద్ధులముగదా ? ఇంతియకాక మాలోకమునకుఁ బోవు నుత్సాహముకంటె మిమ్మెట్లు విడిచి పోవుదుమను విచారమే మాకిపుడు మెండుగ నున్నది.

అశ్వ—విచారమేమి పుత్రీ! మరల శీఘ్రముగానే మనము కలయుదుము. ఆసన్న కళ్యాణయగు ఈ మదనసాయక మోహమునఁ జక్రవర్తినీ చిహ్నములే చూపట్టుచున్నవి. ఋతధ్వజ కుమారునకు ఈమె అర్థాంగలక్ష్మి కాఁగలదు. అపుడు వారిద్దఱును నామందిరముననె వధూవరులగుట దైవము వ్రాసిపెట్టినదిగాః. • •

కుం—[అపవారించి, మద. తో] వింటివా చెలీ! ఇతని అమోఘ వాక్యములను ? అప్పుడు నే నేమంటిని ?

మద—[అపవారించి, ఆమెతో] అబ్బా ? నన్నేమి చెప్పు

మందువు? నామనమున సంతోషపూర మిప్పుడు పొంగి పొరలి పాఱుచున్నది. నా కేమియుఁ దోఁచకున్నది.

తుం—[అశ్వస్థునితో] అయ్యా! నీ యాశీర్వచనమే తప్పక ఫలించునుగాక. నీకతన మాకందఱకుఁ గళ్యాణమయ్యెను. మాకింక నేమి కొదవ?

అశ్వ—ఇఁక నాలసింపనేల? మహాత్మా! నా మందిర మునకు విచ్చేయుము. బిడ్డలిద్వరితోఁ దాము నేఁడు నా యాతిథ్యము స్వీకరింపవలయును. నేఁడే మిమ్ముఁ బ్రయా ణము చేయింతును. రండు. బిడ్డలారా! రండు.

[అందఱు నిష్క్రమింతురు.

---

# మదనసాయక

## తృతీయాంకము

స్థలము—తపోవనము : రంగము—గాలవాశ్రమము.

గాల—[ప్రవేశించి] అహో! ఏమి నాభాగ్యము! కారణ వశమ్మున నొక పర్వతగుహా గృహామందు ఒక్కుమ్మడిఁ జొచ్చిన రవి శశి రేఖలవలె రాక్షసకులము నంతరింపఁజేసి వచ్చిన ప్రతాపశాలి ఋతధ్వజ రాజకుమారుఁడును, దానవధౌర్త్యానలంబు పాలఁబడియుఁ గ్రొమ్మెఱుఁగు దేఱిన పైఁడిబొమ్మనాఁబరగు సుగుణముల ప్రోవు మదనసాయకయు నాయాకుటింట వెలుగొందుచున్నారు. వారి దాంపత్య మెంత అనుకూలముగ నుండును. వారు వచ్చిన నాఁటనుండియు నా నివాసము ఎలనవ్వులకును, జతుర సంభాషణమ్ములకును, యౌవన విలసనమ్ములకును ఇరవైనది. నిజముగా వారొండొరులు మోహించినారు. కావున నాకోర్కె నెఱవేఱుట మిగుల సులభము. మఱియు, వారిరువురు నాయాశ్రమమునకు వచ్చి అప్పుడే చాలదినము లాయెను. ఇఁక వారి నిచట నట్టెయుంచఁ జనదు. కర్తవ్యము నడపెదను. [అని కొంతవడి యాఁగి] మునులను సందర్శించి వచ్చెదమని ఋతధ్వజుఁడును, దుంబురుఁడును బోయి చాల తడవయ్యెను. పుష్పములు గోసికొందుమని చెప్పి మదనసాయకయు, గుండలయు బోయిరి. వారెవ్వరును యింతవఱకు రాకైరి. ఇఁక వారికై నేనే పోవలయును. [ఊర్ధ్వమవలోకించి] అప్పుడే ప్రొద్దుగ్రుంకుచున్నది. కావునఁ గాల్యకృత్యములు దీర్చి కొని పోయెదను. [అని నిష్క్రమించును.

స్థలము——మునుపటిదే : రంగము——వనాంతరము.

[ఋతధ్వజుఁడు ప్రవేశించును.]

ఋత:——ఔరా! అతిసాధువులగు ఈమునీశ్వరులకా అంతటి యగచాట్లు సంభవించెను? ఇప్పుడు వీరి సంతోష మేమన వచ్చును? తొల్లి రామునకు దండకారణ్యవాసులువలె వీరలు నేఁడు నాకొనర్చిన సత్కారమును, నాయెడఁ జూపిన వాత్సల్యమును నేను వర్ణింపఁజాలను. ఇట్టి పవిత్ర మూర్తుల దర్శించుటచే నాజన్మము సఫలమైనది. మఱియు నేఁడు తుంబురుఁడు వారికతిథియే అయ్యెను. [పరిక్రమించుచు] ఇది తపోవనాంతరముగదా? ఇచ్చటఁ గూడ అప్పుడే వసంతుఁడు ప్రవేశించినాఁడు.

గీ. మునికుమారులు నాటిన ♦ పూవుఁజెట్లు
విరిసె నన్నియు; మావులఁ ♦ బికచయమ్ము
రుతమే లాగి నేచె; మలయ మా ♦ రుతము వీచె;
వట్టిమా నొక్కటియును గ ♦ న్పట్ట దిందు.

[మరలఁబరిక్రమించుచు] సకలకుసుమ సౌరభమ్మును జూఱఁగొని అతి మందముగ వీచుచున్న ఈ మలయానిలము నా శ్రమము నపనయించుచున్నది. కావున నిచటఁగొంతతడ వాఁగి గాలవాశ్రమమునకు మరలెదను. [నిరూపించి] ఇందొక వితర్దికనఁబడుచున్నది. దీనిపై నాసీనుఁడనయ్యెద. [అని యట్లు చేసి,కొంతవడికి] ఆహా! మదనసాయకా! నీవు ఎంతచల్లని వేళ జ్ఞప్తికి వచ్చితివే? నీవు నాకు లభింతువా? లభింపవు. నాయది వెడగుభ్రమయే. కాని గాలవుని విధముఁజూడ నాకు ఆస వదలకున్నది. చెలిని దోడ్కొని యిఁక నలఁతికాలములో తుంబు

రుఁడు తనపురమున కేఁగును. గాలవుని యూహాయెట్లున్నను నేను ఒక్కసారియైన ఆమెను ఏకతమునఁ గలసి ఆమెతో సంభాషించినచో నామనస్తాపము కొంతవఱకు దీఱును. కాని యదియెన్నఁటికి సమకూడదాయె. [వేదికపై నుండి లేచి పరిక్రమించుచు] ఇఁక నేనేమి సేయుదును ? [అనికొంతవడికి ముందునిరూపించి] ఏమిది ? ఆ కనఁబడునది మదనసాయక యేనా ? ఔరా ! ఏమి నాభాగ్యము ! ఈమె ఒంటిరిగా రాఁగతంబేమి ? కుండలయేమైనదో ? [వెండియు నిర్వర్ణించి] పుష్పములు గోయుచున్నది. గాలవుఁడీమె నొంటరిగఁ బుత్తెంచి యుండునా ? మరల నానేత్రముల కెంతటి పర్వము సమకూడెను! [మరల నిర్వర్ణించి] ఓహో ! ఈమె యిటేవచ్చు చున్నది. వెండియు నేనామెతో సంభాషించుటకు మంచి తఱుణము లభించినది. కాని నేను ఇచటనే నిలువఁబడి యున్నచోఁ దొల్లింటివలె ఈమె బిడియపడెనేనిఁ గార్యము చెడును. కావున నేను బోయి కొంతవఱకుఁ జాటున వేచి యుండెద. ఆమె యిటురానిమ్ము. [అని అట్లు సేయును.

[మదనసాయక పుష్పాపచయోత్సాహముతో నొడిఁగట్టి ప్రవేశించును.]

మద—[పూలుగోయుచుఁ బాడును.]

(గేయము)

1 వనము సౌందర్యమెన్న ♦ వశమె యీ వసంతవేళఁ ?
కనుల కింపొలయు నవ ♦ కాంతు లీను పూవులివే ॥వ॥

2 మంద వాయువు హృదయా ♦ నందకరంబగుచు వీచుఁ
విందు సేయుఁ జెవులకుఁ గో ♦ కిలల మధురగానములు ॥వ॥

3 పోలిపై మదాళులివె ♦ గ్రోలెడిఁ బుష్పాసవము
కేళికా వనము వలెఁ ♦ గ్రాలు నీ వనాంతరము ॥వ॥

పుష్పములు గోసికొని కుండల నాకంటె ముందుబోయి నది. నేనే యూరక జాలముచేసితిని. [నిర్వర్ణించి] సంజ ప్రొద్దుకూడ అతిక్రమించుచున్నది. కావున దడ దడఁ గొన్ని పూవులు కోసికొని మున్యాశ్రమమునకుఁ బోవలయు.

[అని యట్లొనరించు చుండును.

ఋత—[తనలో] ఆహా! ఈమె యిపుడు ఒంటరిగానే యిచ్చట నున్నది. మఱియుఁ బువ్వులుకోసికొని వేగమే పోవును. నేనీమెతో సంభాషించుటకు ఇదియ సమయము.

[అని బయటకు వచ్చును.

మద—[వానిని గని, యొడి జాఱవిడిచి] ఏమిది? ఈమోహన మూర్తి యిచ్చటనున్నాఁడే? ఏమిచిత్రము! వీనిని గనిన నాతనువు కంపించు చున్నది. చెలియు ఆశ్రమమునకు మరలెను. ఇఁక నేనెటకేఁగుదును? [అని యూ దలవంచును.

ఋత—[దరహాసముతో] మరల ఈమె సిగ్గుఁగొనుచున్నది. కావున నేనీమెను జేరఁబోక కొంతవఱకు అన్యాపదేశముగ సంభాషించుటే కర్తవ్యము. [కోవెల నుద్దేశించి] ఓసీ పికమా! నీవా చెలితో ఇట్లు వచింపుము.

చ. ఓడిలుపడంగరాదనుము; ♦ ప్రీతి వహింపు మటంచుఁ జెప్పు; మె
ప్పుగ చెలితోడ నొంటరిగ ♦ ముచ్చట లాడెడి భాగ్యమబ్బు; నె
న్నఁడు తరళాక్షికిన్ గలుగు ♦ నాపయిఁ బ్రేమగుటంచు నాత్మ సం
దడి పడుచుంటనంచనుము; ♦ ధర్మము కాదను మిట్లు సేయఁగన్.

మద—[స్వగతము] ఆహా! ఈ మోహనాకారునకు నాపైఁ బ్రేమ పెల్లిదముగ నున్నది. వీనికి నేనెట్లు బదులాడుదును? [అని కొంతవడికి] ఓ పికరాజమా! నీవిట్లు బదులు చెప్పుము.

చ. వైరమునఁ గ్రూరదైత్యునొక ♦ వ్రేటునఁ బీచమడంచి యెంతయుం
గరుణ మదీయ జీవములఁ ♦ గాచిన వీరకుమారు నెన్నఁడున్
మఱవఁగఁ జాల నంచనుము; ♦ నా యభివందనముల్ వచింపు; మె
త్తెఱఁగుననైన వానికి వి ♦ ధేయ నటంచును జెప్పు మర్మిలిన్.

బుత——[దరహాసముతోఁ దనలో] నిక్కముగ సుందరి రాగసక్త హృదయయే. అయిన నెండియుఁజూచెదఁగాక. [మరలఁబికము నుద్దేశించి] వసప్రియమా! నిజముగ నాసుందరి నాకు విధేయయేని,

గీ. మనసు దీఱఁగఁ దన తోడ ♦ మాటలాడఁ
బూనితిన యే నిపుడు తొల్లి ♦ తా నొనర్చ
నటులు సేయునో లేక సుం ♦ తయునఁ బ్రేమ
గలిగిన విధమ్ముఁ జూపునో ♦ తెలిసికొనుము.

మద-[తనలో] నాఁటినావర్తన మీసుందరమూర్తి మనస్సు నొప్పించినది. మఱియు నా ననుఁబ్రాయి పల్కులితని కేమి రుచించును? అయ్యయ్యో! ఈపాడులజ్జ నన్నింకను వదలకున్నది. [ప్రకాశము] పికరాజమా!

గీ. చతుర సంభాషణము సల్పు ♦ నతని కిపుడు
సరిగ బదులాడుటకె నేను ♦ జాల ననుము;
నాఁటి నా వర్తనమును దాఁ ♦ బాటిగొనక
నేఁడు దానికి నన్ను మ ♦ న్నింపు మనుము.

బుత——[తనలో] బాగుగనున్నది. ఇఁక నామెను జేరఁ బోయెదఁగాక. [అని సమీపించి] మనోహరాంగీ! బిడియ పడకుము. తొల్లి తాళకేతుని ప్రాసాదమున నిన్నుగనిన నాఁటనుండియు నామనము నీయందు లగ్నమైయున్నది. కాని నీవపుడు బిడియపడుటచే నీతో సంభాషించుటకు

అదను చిక్కుటలేదు. మరల నాయదృష్టవశమున నీవు గాలవాశ్రమమున కరుదేర నిన్ను వెండియుఁ గను భాగ్యము నాకబ్బెను. నీవిచటికి వచ్చిన నాఁటనుండియు నీతో మంతనమున నెపుడు మాట్లాడుదునను కుతూహల ముతో నున్నవాఁడను. అది నేఁటికిఁగదా సమకూడెను ? చెలీ! నీవు ఈ దినములలో నాపై నెఱపుచున్న ప్రేమ దోలుకు చూపులును, భావగర్భిత దరహాసములును ఎన్నఁటికైన మఱవఁగలనా ? కాని ప్రేయసీ! ఇన్ని దినముల నుండియు,

గీ. కనుల సంభాషణమ్ము లే ♦ కలిగె మనకు;
నాత్మ పరిరంభసౌఖ్యమే ♦ యబ్బె మనకు;
ఇపుడు సరసోక్తులకు సెల ♦ వీయ వలయు
నింపు మీఱంగ ననుఁ గౌఁగి ♦ లింప వలయు.

[అనియాశ్లిష్టమభినయించును.

మద—[ఇంచుక వారింపుచు, దనలో] అయ్యో! నేనేమను దానను ? మోహము ఎదుటకు వచ్చిన సంభ్రమము గొల్పుచున్నదే ? నాకేమియుఁ దోఁచకున్నది. ఇపుడు చెలిమైన నాపజ్జనుండిన నాహృదయ మార్యపుత్రుని కెదిరింగించునేమో ? కానిమ్ము. ఇట్లనెదనుగాక. [ప్రకాశము] ఆర్యపుత్రా! నీకు నేను విధేయురాలనిగదా ? ఇంతకును,

గీ. నన్నెపుడు నేమఱక తన ♦ కన్నపుత్రి
లాగు కనుచున్న సకియుఁ, గా ♦ లవుఁడు, సాకు
గురువరుఁడు దేవ మౌని తుం ♦ బురుని దొట్టి
పెద్ద లున్నారు; వారి య ♦ భీష్ట మేమొ ?

బుత—[స్వ] "ఆర్యపుత్రా!" అనుచున్నది. ఈమెకు నాపై ననురాగ మున్నదనుట నిస్సందేహము. కాని మిగుల లజ్జావతియు, గోమల హృదయయు అగుటచే దనమనస్సును ఇంకను దాఁచిపుచ్చుచున్నది. [ప్రకాశము] ప్రేయసీ! నీమాటలు నాకెంతయు దురవగాహముగా నున్నవి. విజ్ఞాన వంతులమగు మన మనోభీష్టముల సంసిద్ధికిఁ బెద్దల సాధనమేల? పేశలాంగీ! కొఱగాని ప్రసంగములతో నన్నిట్లనాదరణచేసి మరుగారి కప్పగింతువా? ఇది నీకుఁ బాడియా? ఇఁక నేనెట్లు తాళుదును?

చ. తివిరి మనోజుఁ డేయు నతి ♦ తీవ్రశరమ్ముల సైఁపఁజాల కే
నువిదరో! నీదుప్రాపుఁ గొని ♦ యుండఁగ నయ్యయొ! ఇప్డు నీకనుంగవ నునుఁజూపుటమ్ము లధ ♦ కమ్ముగఁ జిచ్చువితాన నన్నివే
కవిసి దహించు; మర్త్యుఁడను ♦ గావున నేమనఁజాలఁ; బ్రోవుమా.

(గేయము)

తరుణిరో! స్మరశర, ధాటిక ధైర్యము ♦ దక్కి యిదే నీపాల్పడితిన్;
శరణాగత గ, తిఁయమును నీ విఁక ♦ సల్పకతీఱదుసుమ్మ సఖీ!

మద—

బాలిక నేఁ గదా, గోలను నీ వింక ♦ పల్కుట పాడియె? రాజసుతా!
ఏలా నన్నిటు వేఁడెదు? నీ కొక ♦ హిత మొనరింపఁగ జాలుదు నే?

బుత—

చెలీ! నీ తనులతచే ననుఁ గట్టుము; ♦ వలదిఁక దాక్షిణ్యము నాపై
నిలుపుము నా ప్రాణము ప్రాణేశ్వరి! ♦ నీ యధరామృత దానముచే.

మద—

పరిహాసములకు నే బాల్పడితినో ♦ బాలిక నంచు నెఱుంగవొకో?
సరిసరి యిఁక నీ చెయ్యులు; నీతో ♦ సంభాషించుటె నేరముపో.

ఋత—[వ్యసనముతో] హా! ఎంతపని చేసితిని! నాయనుతాపములో యీమెముద్దరాలను మాటయే మఱచితిని. కావున ఈమె మరలఁ దన ప్రాంతదారియే త్రొక్కుచున్నది. అయ్యో! నేనెంత వివేకహీనుఁడను! మరలఁ జెలి యెట్లు సమాహితయగును? ఈమెహృదయము వెండియు నెపుడు రాగసిక్తమై సహజకోమలత్వమును బ్రకటించును? అంతదనుక ఈ విరాళి నెట్లు సహింతును? ఇఁక నాకేమి మార్గము?

క. మదవైరులఁ బెగటార్చితి;
ముదమే కూర్చితిఁ గడంగి ♦ ముజ్జగములు; కీ
సుదతికినై నే నిపుడా
మదనుని చేఁజిక్కియింక ♦ వ్రందఁగ వలసెన్.

[అని విన్నవోవును.

మద—[తనలో] అయ్యో! ఈపాడుచెవులు ఎట్టిమాటలను వినుచున్నవి! నేనెందు కార్యపుత్రుని నోనాడితిని! నే నెంతకఠిన హృదయను! ఆర్యపుత్రుని పరిదేవన మెట్లు చూడ సహింతును!

ఋత—[వగచుచు] నాధైర్యము శీర్ణమై మనమున దీనభావమే పొడముచున్నది. పచ్చవిల్తుఁడు పెచ్చువెఱిగి నన్ను బ్రేల్మిడిలో నిర్జింపఁ జూచుచున్నాఁడు. ఇఁక నామొఱకుని వారివలన నన్నెవరు రక్షింపఁగలరు? ప్రేయసీ తక్క? [ప్రకాశము]

గీ. కలికి! నిను నాఁడు చెనఁటి గ ♦ కుచ్ఛుని వలనఁ
గాచితిని గానొ? నీ సెఱుం ♦ గవొకొ? దాని

కిపుడు ప్రత్యుపకృతిగ న ♦ న్నీ స్మరాఖ్య
కర్బురుని వాతఁ బడ కుండఁ ♦ గావరాదె ?

మద—ఆర్యపుత్రుని దీనాలాపంబులు నేనిఁక వినఁజాలను. నాకనుల నీరు గ్రమ్ముచున్నది. ఇదియంతయు ననుఁ గూర్చియేకదా ? ఇఁక నేనతనినిఁ జేరఁబోవక మానను. [అని దడదడపోయి వానిహ_స్తముపట్టి]

గీ. రమణ ! మ్రొక్కెద నా దుండ ♦ గము క్షమింపు
మిన్నినాళ్లుగ నీకయి ♦ యెటులు నేన
లంగితినో యది దైవ మే ♦ యుంగు; నింక
నేను నీ దాన; నీ పాద ♦ మాన సుమ్ము.

ప్రియా ! సమాశ్వసిల్లుము. నన్నుఁ గైకొనుము.

[అని కౌఁగిలించును

ఋత—[సంతోషముతోఁ, దనలో] ఆహా ! ఏమి నా భాగ్యము ! [ప్రకాశము] మోహనాంగీ ! నీదయకు నేఁ గృతజ్ఞుఁడను. నా యనుతాపము దీర్చితివి. నన్ను ధన్యునిఁ జేసితివి. నేఁటికిగదా నాయభీష్టము నెఱవేఱెను. నిన్ని దే కైకొంటిని. రమ్ము రమ్ము. నన్ను మరల బిగియారఁ గౌఁగిలింపుము. [ఒండొరులు కౌఁగిలింతురు.

ఋత—[కొంతవడికి] మనోహారిణీ ! మనము ఎటకేనిఁ బోవుదమా ?

మద—ప్రియా ! ఎచటికిఁ బోఁగలము గాలవాశ్రమమునకుఁ దప్ప ? ఇంతియకాక ప్రొద్దుగూడఁ గ్రుంకుచున్నది. కాని ఈ వసంత సమయమున ఈ వనాంతర మెంత రమణీయముగ నున్నదో చూచితే ? కావున మనము ఇచటనేఁ గొంతపడవుండి ఈ వసంతశోభను దిలకింతమా ?

ఋత—అట్లు లేకానిమ్ము. [వారిరువురు పరిక్రమింతురు.

మద—[ఒకవంక నిరూపించుచు] అహ్హా! ఈపొదరింట నెన్ని శారికలున్నవి! ఆర్యపుత్రా! ఇచటి శారికల కలకలము వింటివే?

ఋత—[దరహాసముతో] బాలా! నీవుగోలవే! అయ్యది కల కలమందువా? శారిక లేమనుచున్నవో నీకుఁ దెలియదా?

క. గాటపు మోహముచే స్మర
ధాటికి లోఁబడిన నూత్న ♦ దంపతు లిపు డీ
తోఁటకు వచ్చిరి; పెండిలి
పాటలుపాడంగ వలయుఁ ♦ బదరే యనెడిన్.

మద—[మరలఁ బరిక్రమించి] మనోహరా! కనుము కనుమా పిక దంపతులక్రీడ!

గీ. అల్ల ననిచిన చంపక ♦ వల్లిపైని
విడిసి యతి మందగతి నిష్ఠ ♦ వీచు చల్ల
గాలి లత నూఁపఁగాఁ గెంపు ♦ కంటి జంట
రాగ మెసలార నుయ్యాల ♦ లూఁగు నహహ!

ఋత—చెలీ! నీయంతఃపురములోఁబంగారుతూఁగుటుయ్యేలలో మనమెట్లు క్రీడింపవలయునో తప్పడీ పికరాజములు మనకు నేర్పుచున్నవి. నేర్చికొందము రమ్ము. వాని నొకింతఁ దటియుదము. [అని యామెను లాగును.

మద—[వ్రీడాదరహాసములతో నిరాకరించుచు] ఆర్యపుత్రా! వేఱొకచక్కి కరుగుదము. ఇచటి వింతల నరసితిమి గదా? [ఇరువురు పరిక్రమింతురు. మద.] ప్రియా! ఇచటి కోలాహలమేమి? నామది దిగులుచెందుచున్నది.

ఋత—[చిఱునగవుతో] భయపడకుము చెలీ! ఇది తుమ్మెదల ఝుంకారముగాని మఱియొకటికాదు. పూవులుఈతావునఁ గుప్పతెప్పలుగ నుండుటచే వానియందలి తేనెద్రావు చున్న మదాళులు ఇందు కదుపులు కదుపులుగ నుండి గానము సేయుచున్నవి.

మద—ఇదియు నొకగానమే?

ఋత—[దరహాసముతో] కాకేమి? ఇయ్యది,

గీ. మధువు గొని గొని కనకంపు ♦ విధము వఱచి
యొల్ల కొమ్మలఁ దా మ్రాఁకి ♦ యింపు చొంగఁ
దుల నెగిచి కొంచు మధుపాన ♦ బలముఁ జూపు
మధుప సంతతి సంగీతి; ♦ మందగాన!

మద—ప్రాణేశ్వరా! ఈ మధుపగానము నాకువలదు. ఇంకొక యెడకేఁగుదము. [అనిపరిక్రమించి] ఆహాహా! ఇచ్చటి పూవుంగుత్తులు ఎంతమనోహరముగ నున్నవి? [నిరూపించి] ఆర్యపుత్రా! ఈమంజరిని గల సుమముల కూర్పు గంటివే?

గీ. పువుల వన్యోన్య మొక కొన్ని ♦ కవుఁగిఁలించు;
గొన్ని యొండొంటి ముద్దులు ♦ గొనెడి; నెలమిఁ
జార్చుఁ గొన్ని మరంద బా ♦ ష్పముల నౌర!
విరులు దెల్పెడు నూతన ♦ ప్రియుల సరణి!

ఋత—[దరహాసముతో] జీవితేశ్వరీ! నీవు క్రమముగాఁ బ్రౌఢ వగు చున్నావులే. ఇప్పుడు వసంతునిచే నలంకరింపఁ బడిన ఈ వనసుందరి యొయ్యారము వర్ణింపఁగలవా?

మద—[సిగ్గుగొని యూరకుండును.]

ఋత—రారమ్ము. వర్ణింపుదము. [అనియిట్లుగేయుదురు.

( గేయము. )

అహహా ! వనకామిని మనో, భవశరనిధి యగుటఁ గడుఁ
బ్రియమునఁ జను, దేరెడునిదే, గారవము మై, పురుషతిలక సహితయై
కుంద రదన - కుసుమహాసన
కోకిల వాణి - మయూరగ విలసన
భ్రమర చికుర - పల్లవాధర
మంజు లాంగి - సుకుమారియునై
చెలువు గుల్కుచు - వలపు లొల్కుచు
నాడుచుఁ బాడుచుఁ
దారుచుఁ జేరుచు ॥అ॥

ఋత—ప్రాణేశ్వరీ! వనవిహారము సల్పి మనమిర్వురము మిగుల డస్సితిమి. కావున, ఈవేదికపైఁ గూర్చుండి శ్రమ దీర్చుకొందము రమ్ము.

[ఇర్వురును వేదికపైఁ గూర్చుండుదురు.

[అంతఁ జంద్రోదయమగును.]

ఋత—కనుము ప్రేయసీ! మింటఁజందురుఁడు ఎంతస్వచ్ఛముగ వెలుంగుచున్నాఁడో? వెండిపూఁత పూసినట్టులు ఈ వృక్షాగ్రములపై అతని కరము లెంత దట్టముగఁ బ్రసరించి యున్నవి! మఱియు నిపుడు కమ్మని చల్లగాలి ఇచటి పూవుంజెట్ల నొరసి వీచుచున్నను వాని దాక యాకైన నల్లాడుటలేదు. అహా! ఈరేయి ఎంత కమనీయముగను, సుఖప్రదముగను ఉన్నది!

గీ. ఇట్టిరాతిరి ప్రియునికై ♦ యెదురుచూచుచున్న
యా వరూధిని పూఁచిన ♦ మావి క్రింద

నిలిచి పీడిన నిడుద వే ♦ నలి మొగానఁ
జేర్చి కుందుచు నిశ్వసిం ♦ చెనని తలఁతు.

మద——

గీ. ఇట్టిరేయి సఖీజన ♦ మెల్ల గొలువఁ
బ్రమద వనమున నొక విరి ♦ పాన్పుఁజేరి
రాజహంసము నా కల ♦ రాజ హంసుఁ
గూర్చు తెపుడంచు దమయంతి ♦ గుంద కున్నె?

ఋత——

గీ. ఇట్టి రాతిరి చిత్రాంగి ♦ యట్టె వచ్చి
యిట్టె నడిగాడు నల రాచ ♦ పట్టిఁ గాంచి
బిట్టు వలచుడు నతఁడు చే ♦ పట్టుకున్న
బిట్టు వగచెడు శశికాంత ♦ కుట్టిమమున.

మద——

గీ. ఇట్టిరేయి విరహతాప ♦ మెసక మెసఁగఁ
జలువ రా తిన్నెపైఁ జేరి ♦ సకిని గాంచి
స్వప్నమునఁ దాను గాంచిన ♦ సరస వరునిఁ
దోడి తెమ్మని యుష చాల ♦ వేఁడియుండు.

ఋత——[దరహాసముతో]

ఉత్సాహము. ఇట్టిరేయిఁ దన వయస్య ♦ నేమఱించిపో మనం
బిట్టులై చలింపఁ దోఁట ♦ కేఁగుదెంచి యాత్మలో
గుట్టు దాఁపలేక మరుని ♦ కోల యీ ఋతధ్వజా
జెట్ట పట్టెనంట! ఈ వి ♦ చిత్రముం దలంపరే?

మద——[దరహాసముతో]

ఉత్సాహము. ఇట్టిరేయి నొక్కబోఁటి ♦ హృదయ మీ ఋతధ్వజుం
డట్టె చూఱకొంచుఁ బెండ్లి ♦ యాడుమంచు నామెఁదా
బిట్టుప్రేమ మూడించినట్టు ♦ వేసముల్ ధరించి హా!
ఎట్టకేల కయ్యెకొల్పె; ♦ నింక నేమి సేయునో?

[గాలవుఁడు ప్రవేశించి వారున్నస్థితి నూహించి చాటున నిలుచును.]

ఋత—[ఆమెను ముద్దుఁగొని] ప్రాణేశ్వరీ! అట్లనకుము. ఆ జాబిల్లిసాక్షిగ నిన్నేవలచియున్నాఁడను.

మద—[దరహాసముతో] నిలుకడలేని ఆజాబిల్లియా నీవలపునకు సాక్షి? అతనికివలెనే నీవలపునకుఁగూడ వృద్ధిక్షయము లున్నవో?

ఋత—క్షమింపుము సఖీ! నీవెట్లుప్రమాణము చేయుమన్న అట్లే చేయుదును.

మద—[నిర్వర్ణించి] ఆర్యపుత్రా! ఎవరో యిటువచ్చుచున్నారు

[అని లేచును. ఋతధ్వజుఁడు నిర్వర్ణించును.

[అంత గాలవుఁడు వెలికి వచ్చును.]

గాల—[అచ్చెరువుతో, స్వగతము] ఏమిది! నాబిడ్డలుఇప్పుడే గాంధర్వవిధిని వరించిన నూత్నదంపతులవలెఁ దోఁచుచున్నారే? నాయభీష్టమును ఇట్టిదియేకదా? ఆహా! నేఁడు నానేత్రములకెంతటి మహాపర్వము సమకూడినది! [వారిని డజియుచు, ప్రకాశము] వత్సలారా! మీకై నే నెంత వేచియుండినను మీరు రాకుండుటచే ఏమియుఁ దోఁచక నేనే మిమ్ములను వెదకికొంచు వచ్చినాఁడను. వచ్చినందుకు నా కనుల కఅవుదీఱినట్లు మిమ్ముల నిద్ఘరను ఒకయెడనే కన్గొనఁ జాలితిని. మీ యన్యోన్యానురాగ మింతకుముందే యెఱింగి మీ దాంపత్యమునే నేను యోజింపుచుండ మీయభీష్టము దీర్చుకొనుచు నాయభీష్టసిద్ధియు సాధించితిరి. అయిననేమి? రండు రండు.

[అని యిుండొరుల కేల్లువట్టి]

ఉ. అండజయాన తావలచె ♦ నంగజసన్నిభమూ_ర్తియైన భూ
మండలనాయకాత్మజుని; ♦ మానిని నెంతయుఁ బ్రేముడించె నీ
తండు నయాగె! వీరల య ♦ థావిధి పెండిలి యింతలోనఁ గ
న్పండువుగాఁగఁ జూడఁగల ♦ భాగ్యము నాకు లభింప కుండునే?

ఇర్వురు—[గాలవునకు నమస్కరింతురు.]

గాల—కళ్యాణము కళ్యాణము బిడ్డలారా! మీకు అనంత కళ్యాణ మగుఁగాక! రేయి మట్టుమీఱుచున్నది. రండు. మన ఆశ్రమమునకు మరలుదము.

ఇర్వురు—మహాప్రసాదము.

[అందఱు నిష్క్రమింతురు.

---

# మదనసాయక

## చతుర్థాంకము

స్థలము—తపోవనము : రంగము—వనాంతికము.

[మునివేషధారియై తూర్యకేతుఁడు శిష్యవర్గముతోఁ బ్రవేశించును.]

(గేయము.)

దినమణి తేజ! మహా, తపోధన!

1. నిర్జితహృదయ జ ♦ నిత షడ్రిపుగణ!
   ధూర్జటి సన్నిభ! ♦ దురిత విదారణ!॥ ది॥
2. సంతత వేద వి ♦ చారణ చణమతి!
   చింతా తంతు ♦ చ్ఛేదన నిరతి!॥ ది॥
3. విశ్వజన నుసే ♦ వీత పద! సదయా!
   శాశ్వత పదవీ ♦ సంస్థిత హృదయా!॥ ది॥

తూర్య—[తన్ను బాఁజూచుకొని] వేసము బాగుగ నమరినది. కుఱ్ఱలు మునికుమారులను లెస్సగ ననుకరించుచున్నారు. [నిరూపించుచు] ఈ పర్ణశాలయు యథోచితముగ నున్నది. లోపము ఎందును గానరాదు. కాని ఈ కపటవేష మెందులకు ధరించినట్లు? అన్నను జంపిన ఋతధ్వజరాజ కుమారునిఁ గన్గొనుటకుఁ గదా? అది యెట్లు సాధ్య మగును? కాకేమి? అతఁడు ఎంతవాఁడైనను మాయో పాయమునకు లోఁగకుండునా? నాయన్న అమిషమగు ఆ గంధర్వ కన్యను మాకులము నంతరింపఁ జేసినందులకుఁ గానుకగా ఋతధ్వజునకు గాలవుఁడొసంగెనఁట. వారి రువురును వధూవరులై అయోధ్య జేరుకొనిరఁట. కాని ఋతధ్వజుఁడు గాలవమునిదర్శనార్థము మరలఁ జనుదెంచు నని ఆకర్ణించితిని. అది నిశ్చయమేని నా ఆకుటింటికి తఁడు

రాకుండ గాలవమున్యాశ్రమమునకుం బోఁజాలఁడు. కావున, అతఁడు వచ్చువఱకును నేను ఇచటనే తాపస వృత్తితో వేచియుండెద. అతనిపైఁగల కసిదీర్చుకొనుటకు మేటి యుపాయ మొకటి యున్నది. మీఁదేట్లుండిన నుండనిమ్ము. కార్యము బహు జాగరూకతతో నిర్వర్తింపుదును గాక. [శిష్యుల నుద్దేశించి ఛాత్రులారా! మీ పాఠమును మఁగుడ వల్లెవేయుఁడు.

శిష్యులు—చిత్తము. [అని పైగేయమును మరలఁ బాడుదురు.

తూర్య—మంచిది. మనమందఱము ఇచటఁ గూర్చుండి తపోనిష్ఠ నభినయింతము రండు. [అందఱట్లు సేయుదురు.

తూర్య—[కొంతవడికి లేచి, నిర్వర్ణించి] ఓహో! ఏమిది? ఋతధ్వజుఁడు ఇప్పుడే వచ్చుచున్నాఁడే? రానిమ్ము రానిమ్ము. నాచిత్తము గలింపను. వానిని ఉచితరీతిని గౌరవించెద. [అని కూర్చుండును.

శిష్యులు—[కొందఱు నిర్వర్ణించి, లేచి] దేవా! మాకు భయమగుచున్నది. మమ్ముఁ బంపివేయుఁడు.

తూర్య—[కనలుచు] ఛీ నిర్భాగ్యులారా! కూర్చుండుఁడు కూర్చుండుఁడు. మీలో నెవఁడు మాటాడినను వాని నుఱుముచేసెద. [అందఱు దపము నటించుచుందురు.

[అంతి ఋతిధ్వజుఁడు ప్రవేశించును.]

ఋత—[అలసట నభినయించుచు] అబ్బబ్బా! ఈ ప్రయాణశ్రమము ఎంత దుర్భరముగ నున్నది! మానగరమునకు అనతిదూరమున నుండెడి గాలవాశ్రమము ఇప్పుడతి

దూరమగుట రాక్షసుల కతమున నే కదా? మఱియు, అదియింకను దవ్వులనే యున్నది. కావున నేఁడిచట శ్రమదీర్చుకొని మరలఁ బ్రయాణము సాగింతును. [నిర్వర్ణించి] ఇది తపోవనాంతికము గదా! ఇచట ఈ మున్యాశ్రమ ముందుట నాయదృష్టమే. మునియు ధ్యాత్రా న్వితుఁడై యోగనిద్ర నున్నవాఁడు. వానినెట్లు సమీ పింతును? [అని వానిచెంత నిలుచును.

తూర్య—[తెలివి నభినయించి, శివస్మరణచేసి, చూచి, లేచుచు] ఏమిది? ఋతధ్వజుఁడా? ఇతఁడు మాఋతధ్వజుఁ డేనా? హా! ఏమి భాగ్యము! రాజకుమారా! రమ్ము రమ్ము. నీకు స్వాగతమే? [అని వానిని జేరఁదివియుచు]

గీ. స్వాగతమె రాక్షసేభ హ ♦ ర్యక్షమునకు?
స్వాగతమె మౌని హృత్సరో ♦ జాత రవికి?
స్వాగతమె శిష్టరక్షణో ♦ ద్యోగ రతికి?
స్వాగతమె శత్రుజిద్భూమి ♦ పతి సుతునకు?

వత్సా! రారమ్ము. ఇచట సుఖాసీనుఁడవుకమ్ము. [అందఱు గూర్చుండిన వెనుక] వత్సా! మమ్ముల నందఱను మరలఁజూడ నీకు మనసు పుట్టెనే? అధీశ్వరుఁడు సేమముగా నున్నవాఁడే?

ఋత—మహాశీయా! తమదయచే మాకందఱకుఁ గుశలము.

తూర్య—సంతోషము సంతోషము. కుమారా! నీయాగమన ప్రయోజనము వినఁగోరుచున్నాడను.

ఋత—మానీంద్రా! గాలవాశ్రమమునకుఁ బోవుచు ఇచటకి వచ్చితిని. నాయథావిధి వివాహమునకు ఆ మునిపుంగ

వుఁడు చనుదెంచును. కాని నేను అతనిని స్వయముగఁ బిలువవలెనని తొల్లి యతఁడాజ్ఞాపించె. జనకుని పంపున నేనిపుడతనినిఁ బిలువఁ బోవుచున్నాను.

తూర్య—[సంతోషము నటించుచు] ఓహో! ఋతధ్వజ రాజకుమారుఁడు గంధర్వకన్యను బెట్టపట్టనున్నాఁడా? ఏమిపున్నె మేమిపున్నెము! వత్సా! తొల్లినీవు ఆమెతో గాలవమునీంద్రుని ఆశ్రమమునుండి వెడలునపుడు నేను అచటనుండియును మిమ్ములను అభినందింపనైతిని. నేఁడు నిన్నుఁజూచుటచే నాకనుల కఱవుదీఱె.

ఋత—మునివర్యా! తాము ఈ వనాంతికమున ఆశ్రమము నిర్మించుటకుఁ గారణమేమి?

తూర్య—[స్వగతము] అన్నా! చిక్కుతటస్థింపదుగదా? ధైర్యమా! నన్నెడఁబాయకుము. [ప్రకాశము] ఏమిచెప్పుదును. తొల్లి రాక్షసులు చెలరేఁగి ఆయాతపోవనంబులం గల నాబోంట్లను గాఱియ పెట్టుచుండిన దినములలో నేను నా శిష్యబృందముతో ఎటకేనిఁ బోవుదునని ప్రాణములు బిడికిటఁబెట్టుకొని ఇచటికి వచ్చునప్పటికి నీబాహువప్ర గుప్తి మాకు సమకూడెను. అయినను నాఁటినుండియు నేనిచటనే ఒకపర్ణగృహము నిలుపుకొని కాలము గడుపుచున్నాఁడను. ఇప్పుడిప్పుడే కదా తపోవనములు యథాస్థితినున్నవి? కాని కుమారా! నేఁడు నీవు నాకు అతిథివి సుమా? నీవిపుఁడెట్లును గాలవాశ్రమమునకుఁబోవంజాలవు.

ఋత—మహాత్మా! అట్లేకానిండు. ఇచటికి గాలవాశ్రమము ఎంతదూరముండును?

సూర్య—క్రోశద్వయమునకుఁ బైగా ఉండును. నేను తఱచుగా ఆ మునికడకుఁ బోయి వచ్చుచుందును. కాని నీవిచటఁ గొంతవడి విశ్రమించినచో అనాయాసముగఁ బోఁగలుగుదువు. నేనును గాలోచితములఁ దీర్చి యిప్పుడే వచ్చెదను. మన మారగింతము. [శిష్యులనుద్దేశించి] వటువులారా! మీరు వైళమ పోయి రుచ్యములగు కందమూలఫలమ్ములు సమృద్ధముగఁ గొని తెండు. నేఁడొక రాజనందనుఁడు మనకు విందయ్యెఁ గదా?

శిష్యులు—చిత్తము దేవా! [అని నిష్క్రమింతురు.

సూర్య—వత్సా! నాయభీష్టమొకటి నీవు దీర్చవలయు.

ఋత—తప్పక నెఱవేర్చెదను. అదేమియో ఆనతిండు.

సూర్య—వత్సా! వరుణ జపము చేయుదునని నేను ఎన్ని నాళ్ళ నుండియో ప్రయత్నించుచున్నాఁడను. కాని నేఁటి వఱకది నెఱవేఱదయ్యె. ఏమియన, దదాచరణమునకు ముందు స్నానాదిక్రియలు శూన్యకంధరముతోఁ జేయ రాదు. మాబోఁటి తాపసులకుఁ గంఠహారములు లభింపవుగదా? నేఁడు నీవిచటి కరుదెంచుటచే ఆజపమొనర్ప వలెనని మనము కుతూహలపడుచున్నది. కావున నీగ్రీవమందలి మౌక్తికహార మొకసారి నాకొసంగు దేని సఫల మనోరథుండనయ్యెద.

ఋత—భాగ్యమా? ఇదే కైకొనుఁడు.

[అని మౌక్తిక హార మతనికిచ్చును.

సూర్య—[కైకొని] ధన్యోస్మి ధన్యోస్మి! నేఁడు గదా నామనోరథం బీడేఱును? కుమారా! నీవు మార్గాయా

సముచే మిగుల బడలితివి. ఈకుశాస్తరణముపై నేను వచ్చువఱకు శయనింపుము. నేను ఈ యంతిక సరోవరమ్మునసే కృతస్నాతుఁడనై జపమొనర్చి వైళంబ వచ్చెదను.

ఋతు—మునివరు నాజ్ఞ.

[అని శయనించుట నభినయించును. తూర్యకేతుఁడు నిష్క్రమించును.]

స్థలము—సాకేతపురి : రంగము—మదనసాయకాంతఃపురము.

[కృతస్నాతయు, నిర్మలవస్త్రధారిణియునై మదనసాయకయు, ఇర్వురు చెలికత్తెలును ప్రవేశింతురు.]

ప్రథమసఖి—ఏమే మదనసాయకా! నీకనులు ఎఱ్ఱగ నున్నవి? తల యంటుకొనినపుడు సంపెగనూనె కన్నులకు దిగెనో?

మద—లేదుసఖీ! నిన్న రేయి నిద్దుర పట్టినదికాదు.

ద్వితీయసఖి—అవును. యువరాజు తన చెంతలేక మదనసాయకకు ఎట్లు నిదుర పట్టును?

మద—ఎకసక్కెములాడకు చెలీ! నిన్ను బతిమాలెదను.

ప్ర—నీకు నిద్రపట్టకుండుట కేమికారణమే?

మద—చెలీ! నిన్నరాత్రి ఒక దుస్స్వప్నముం గంటిని. అది యిపుడు తలఁచుకొనిన ఒడలు జలదరించుచున్నది. నిన్న నీవు తుఱిమిన సిగదండ పట్టుసడలి నా శయ్యపైఁబడినట్లును, అదియొక సర్పమై నా ప్రక్కనుజేరి నాహృదయమునఁ బొడిచినట్లును గలవచ్చినది. ఇదియేమిపాపమే? ఆర్యపుత్రునికేమియు నపాయము వాటిల్లియుండదుగదా?

ద్వి——సఖీ! నీవూరకుండుము. కలఁత నిదురలోఁ గలలకుఁ గాఁదవేమి? నీ ప్రాణేశ్వరుఁ డింటికి వచ్చినగాని నీవు మగుడ సమాహితవు కావు. నాకుఁ దెలియును.

మద——నీ వెప్పుడును ఇట్లేయందువు చెలీ! నా గుండెలిపుడు ఎట్లదరుచున్నవో చూడుము. [అని యామె చేయి దివియును.

ద్వి——[చేయిలాఁగికొనును] వలదు చెలీ! యువరాజు నేఁడో తేపో చనుదెంచునుగదా? అతనితో ఒకరేయి నీ స్వప్న వృత్తాంతము చెప్పి నీగుండె లదరుట అతనినిఁ జూడు మనుము.

ప్ర——[ద్వితీయ నుద్దేశించి] ఏమి మోటుతనమే? నీవుండుము. [మద. నుద్దేశించి] మదనసాయకా! నీవప్పుడు మమ్ములను లేఁపరాదా? నీ చెంగటనే పండుకొంటిమిగదా?

మద——మీ కేల నిదుర చెఱుపవలెనని యూరకొంటిని. కాని చెలీ! గాలవుని దోఁచుకొని ఆర్యపుత్రుఁడు సురక్షితముగఁ జనుదెంచునా?

ప్ర——భయపడకు చెలీ! అసహాయ శూరుఁడగు నీజీవి తేశ్వరు నకా భంగపాటు వాటిల్లుట? ఇంతకును స్వప్నములను ఏల పాటించెదవు సఖీ!

మద——పోనిమ్ము. కాని యేమే? వివాహమ్మునకై రాజబంధువు లందఱును అప్పుడే వచ్చియుండినను నా జననీజనకులు ఇంకను రాలేదు? నాకెన్నియో బుద్ధులుచెప్పి నన్ను విడువలేక విడిచి పోయిన కుండలయు, దుంబురుఁడును వారిని గలియుటలేదో? లేక వారు నాపైఁ గినుక వహించిరో? మందభాగ్యను!

ప్ర—ఓసీ! నీ వెంతగోలవే? నీ వివాహమునకు నీ తలిదండ్రులు ఏల రాకుందురు? వారికి నీపైఁ గోపమెందులకు?

ద్వి—మగనిపై మక్కువచేఁ దలిదండ్రుల నొప్పరికించి అతని వెంటఁ బోయినందులకు వారు కోపగింతురని మదనసాయక భ్రమపడుచున్నది. ఇంతకుదక్క వేఱు కారణము కానరాదు.

ప్ర—[ద్వితీయ నుద్దేశించి] బాగుగ జెప్పితివి లే. ఇట్టికోప కారణము ఇంతకుముం దెన్నఁడెఱుఁగను. [మద. నుద్దేశించి] సఖీ! నీ జననీజనకులు నేఁటికి రావలయునని రాణిగా రనుచుండ వింటిని. ఎందువలననో నేఁడు సైతము రాలేదు. కాని, వారు నీ పెండ్లినాఁటికైన దప్పక వత్తురు చూడుము.

ద్వి—నేఁడు మన మదనసాయక పెండ్లికూఁతు రగునని వారెఱుంగరా? కాని చెలీ! అడుగమఱచితిని. నేఁటి యుత్సవము నాగలోకమున జరుగుననియు, మనమందఱము నచటికిఁ బోవుదుమనియుఁ జెప్పియుంటివే? ఏల అట్లు జరుగలేదు?

ప్ర—ఇందుల కధీశ్వరుఁడే కారణము. రాజకుటుంబమందలి అన్ని వివాహములకును ప్రారంభోత్సవము నాగలోకమున నొక నాగరాజు మందిరమున జరుగుట తాతల నాఁటి నుండియుఁ దప్పని ఆచారమై యున్నదఁట. అందువలననే నేఁటి ఉత్సవమునకు రాజ కుటుంబమును దోడ్కొని పోవుటకు ఆ నాగరాజు కుమారుఁడు వచ్చియుండెనఁట. కాని వివాహము సమీపించుటచేఁ

ప్రయాణమునకుఁ జాలినంత వ్యవధి లేదని రాజుగారు వానికిఁ జెప్పి పంపఁదలఁచినట్లు వింటిని.

ద్వి—అయ్యో! నాగవాసమును జూతునని ఎంతో వేడుక పడుచుంటిని గదే? అది వింతలకును, వినోదములకును బుట్టినిల్లఁట.

ప్ర—మనమేమి చేయఁగలము?

[అంత వస్త్రాభరణములతో నిండిన యొక పళ్లెరముతో వేఱొక చెలికత్తె ప్రవేశించును.]

తృతీయ—వినుఁడు వినుఁడు. మదనసాయక కిదే శుభవార్త. రాణిగారు ఆమెతో నిట్లు చెప్పుమనిరి. "తమ కుమారి నేఁడు ధరించుటకై ఈయమూల్య వస్త్రాభరణములు ఇప్పుడే విశ్వావసుఁడును, గుముద్వతియుఁ బంపించినారు. కొన్ని ప్రతిబంధకములచే వారిరువురు నేఁటికిరాఁజాల కుండిరి. కాని వివాహ దినమునాఁటికిఁ దప్పక వత్తురు" అని. మఱియుఁ దమకుమారిని దీవించిరనియు, ఆమెను జూచుటకు వారు మిగులఁగుతూహల పడుచుండిరనియుఁ గూడఁ జెప్పుమనిరి. ఇంతియ కాక, ఈ యుడుపులును, సొమ్ములును దక్క వేఱొండు మదనసాయక నేఁడు ధరింప వలదనియు ఆనతిచ్చిరి. మదనసాయకా! వీనినిఁ బరిగ్రహించి రాణిగారి ఆజ్ఞ నెఱవేర్చుము.

[అని పళ్లెర మామెకడ నుంచును.

ద్వి—చెలిమోము ఇప్పుడు కదా వికసించినది? [మదన. నుద్దేశించి] చెలీ! మదనసాయకా! వీనినిఁ గైకొనవేమి?

ప్ర—సఖీ! నేను జెప్పితినిగదా నీతలిదండ్రులు తప్పక వచ్చెద

రని? నేఁటికి వచ్చుటకు ఏదియో ప్రతిబంధక ముంటుటచే ముందుగా ఈ భూషణాంబరములు పంపినారు. వీనిని ముందు గైకొనుము.

మద—చెలుల ఆజ్ఞ. అట్లే కైకొందును. [అని వానిని ధరింపుచుఁ, దృతీయతో] ఓసీ! నీవుపోయి దేవిగారికి నా నమస్కృతుల నర్పించుచు వారి ఆజ్ఞ శిరసావహించితి నని చెప్పుము.

తృ—అటులే చెప్పెదను. [అని నిష్క్రమించును.

మద—చెలులారా! నేఁడు నాకు ఎంతయు సుదినము. కాని ఏలొకో నా మనము ఆర్యపుత్రుని మీఁదికే పరువిడు చున్నది?

ప్ర—ఊరకుండుము సఖి! నీకంతయు మేలే యగును.

[అంతఁ బుష్పచందన మాల్యాది పూజాద్రవ్యములతో నింకొక చెలికత్తె ప్రవేశింతును.]

ప్ర-నిర్వర్ణించి] ఇదియేమి? చందన మాల్యాదులు ఈమె యిచటికిఁ గొని వచ్చుచున్నదే?

ద్వి—చెలి కాత్యాయనీ పూజ సలుపుటకుఁ గాఁబోలు.

తురీయ—[ప్రవేశించి] యువరాజపత్నికి రాణిగారిట్లు చెప్పమనిరి. "ఒక మునీశ్వరుఁడు మదనసాయకనుజూడ నరుదెంచు చున్నవాఁడు. వారికి యథోచిత సపర్యలొనర్చుటకై పూజాద్రవ్యములు పంపఁబడినవి. వీనిని గైకొని మౌనిని యథావిధి సత్కరింపవలయును." అని.

[అని వానిని మదనసాయక యెదుట నుంచును.

ప్ర—[సంతోషముతో] ఎంతపుణ్యమే సఖి! నేఁడు నీకు మునిసందర్శనలాభము!

ద్వా—చెలీ! ఇఁక నీ దుస్స్వప్నమునకు వెఱఁగందకుము. మహాత్ముల దర్శనము సకలదోషములను నివారించునుగదా!

మద—[తురీయ నుద్దేశించి] ఓసీ! మునీంద్రుఁడు అప్పుడే యరుదెంచు చున్నవాఁడా?

తురీయ—[నిరూపించుచు] వీరే, కనుము.

[అంత మునివేషధారి తూర్యకేతుఁడు ప్రవేశించును. అందఱు లేతురు.]

మద—మునిచంద్రా! మదనసాయక ప్రణమిల్లుచున్నది.

[అని యట్లు చేయును.

తూర్య—కళ్యాణము బిడ్డ! కళ్యాణము. [తనలో] ఇది ఆచారోక్తిగదా?

చెలులు—మునిపుంగవునకు మా దండప్రణామములు.

[అని యట్లు సేయుదురు.

తూర్య—కళ్యాణము కళ్యాణము. దీర్ఘసుమంగలోభవత!

మద—మహానీయా! ఈ యాసనము నలంకరింపుఁడు.

[తూర్యకేతుఁడు కూర్చుండును.

మద—

[చెలుల సాయమున నతనినిఁ బుష్పాదులతోఁ బూజించును.]

( గేయము. )

తాపసేంద్రా! మిమ్ముఁ గనుంగొన, ధన్యనహో! కడు ధన్యనహో!
జన్మము సార్థక మయ్యె మునీశ్వర! ధన్యనహో! కడు ధన్యనహో!

ము_క్తి సతీ హృదయేశ్వర! మానీ!
దురితారణ్య దవానల! మానీ!
శంకర సన్నిభ! సదయా! మానీ!
తావక సేవకురాలనిదే - కరుణాభరణా ॥తా॥

తురీయ—[సపర్యమైనవెనుక] అమ్మా! దేవిగారు నా రాక కెదురు చూచుచుందురు. పని విని యెదను.

మద—పోమ్ము. [తురీయ నిష్క్రమించును.

మద—[తూర్యకేతు నుద్దేశించి] మహానీంద్రా! మీ యమోఘ దర్శన ప్రాప్తిచేఁ గడు పవిత్రురాలనైతిని. మీరాక సమస్త దోష నివారణమును, సర్వమంగళ సంధాయక మును గదా?

తూర్య—[తనలో] ఈ నిండు జవరాలి మోముజూడ నా పన్నుగడ విఱుగఁబడి హృదయము చెదరుచున్నది. [ఆలోచన నభినయించి] అయినను ధైర్యవృత్తి విడు వను. అనాసుర వర్తన మొల్లను. [ప్రకాశము] పుత్రీ! ఈ మందభాగ్యుని రాక అట్టిదై యుండిన ఎంత బాగుండును!

మద—[ఉలికిపడి] మునివర్యా! ఏమి యిట్లనెదరు? నా ఆర్యపుత్రుని విషయమై కాదుగదా?

తూర్య—పుత్రీ! నీ ఆర్యపుత్రుని వద్దనుండియే వచ్చు చున్నాఁడను. అతఁడే నన్ను నీ కడకుఁ బంపినాఁడు.

మద—[ఆశ్చర్యముతో] హా! ఏమివింత! ఆర్యపుత్రుఁడు నాకుఁ దన వర్తమాన మంపు టేమి? అతఁడు ఇంకను గాలవాశ్రమముననే ఉండెనా?

తూర్య—భిక్షా! ఏమి వచింపుదును? అతఁడు గాలవాశ్రమ మును జేరుటయే లేదు. అతఁడు ప్రయాణ మొనర్చుచుండ మార్గమునఁ దొల్లి అతనిచే సంహరింపఁబడిన తాళ కేతుని తమ్ముఁడగు తూర్యకేతుఁడను రాక్షసుఁడు ఋత ధ్వజుని మాఁర్కొనెను. వారిరువురకును ఘోర సంగ్రా మము జరిగినది.

మద—నా ప్రాణేశ్వరుఁ డారక్కసుని వధించెనా?

తూర్య—అట్లయిన ఏమి విపరీతమున్నది? ఆ చెనటి రక్క సుఁడు ఉక్కసెడక తన యన్నం జంపిన కోపము మన మ్మున రగులుచుండ అతితీవ్ర యుద్ధమొనర్చి నీ మగని జయించినాఁడు.

మద—[విచారముతో] అయ్యో! ఏమి విపరీతము! ఆర్య పుత్రునికిఁ బ్రాణోపద్రవము గలుగలేదు గదా?

ప్ర—[అపవారించి, ద్వితీయతో] ఇదేమిటిదమ్మా యీ మబ్బులేని పిడుగు?

ద్వి—[అపవారించి, ప్రథమతో] ఏమిపాపమో తెలియదు. నా పాదములు వణఁకుచున్నవి.

తూర్య—పుత్రీ! నాకు నోరాడకున్నది. వారిరువురును ద్వంద్వయుద్ధ మొనర్చి ఒకరి నొకరు లెస్సగా హింసించు కొనిరి. అందు ఋతధ్వజునకు గాయములు మెండుగఁ దగిలెను. రాక్షసులు మరలఁ దపోవనమునఁ బ్రవేశింప నున్నారను భయముకలిగి మేము మా ఆశ్రమములను విడిచి నలుకెలంకులఁ బరువిడుచుండఁ శాప మాతిఁడు

దూరమున సన్నఁగని చెయిసన్న చేయఁగాఁ బ్రాణా
విలావశిష్టుఁడైన నీ ప్రాణేశునిడాసితిని. అంత నతఁడు
తనస్థితి నాకుఁజెప్పి తన కంఠసీమందలి మౌక్తిక హార
మును దీసి ఎట్లయిన అయోధ్యకుఁజని నీ కొసంగుమని
ప్రార్థించి ప్రాణములు విడిచినాఁడు. అట్లే కానిమ్మని
ప్రాణములపై ఆసవదలి ఏకాయకీ ప్రయాణము లొనర్చి
నేఁడు నీకడకు రాఁగలిగితిని. [తీయుచు] ఇదే, ఈహారము
గైనుము. [అని యామె కిచ్చును.

మద—[కొని, కని] హా! ఆర్యపుత్రా!

[అని మూర్ఛిల్లి నేలవ్రాలును.

ప్ర—[విచారముతో] హా చెలీ చెలీ! ఎంత మందభాగ్యవు!
మాకేమి మార్గము? [ద్వితీయతో] ఓసీ! నీవు వైళమ
పోయి యువరాజపత్ని మూర్ఛిల్లినదని దేవితోఁ జెప్పుము.
ముందొక వీవనయుఁ, బన్నీరును దెచ్చిపెట్టుము.

ద్వి—ఆలాగే. [అని పోయి, కొంతవడికిఁ దెరలోనుండి]
వీవన కనఁబడ లేదమ్మా!

ప్ర—[మదనసాయకను బైఁటచెంగుతో విసరుచు] బల్లపైనే
ఉన్నదిగదే? క్రిందఁ బడినదేమో చూడుము.

ద్వి—[తెరలోనుండి] ఎచ్చటను గానరాకున్నది.

ప్ర-సరే! నేను వచ్చుచున్నాను. నీవు దేవియొద్దకుఁ బొమ్ము.

ద్వి—[తెరలోనుండి] అట్లే. [ప్రథమసఖి నిష్క్రమించును.

తూర్య—[లేచి] నిక్కముగ ఈమెహృదయము వ్రక్క
లైనది. ఈ అమితశోకము సహించి తనువు నిలుపఁ

జాలదు. నా యభీష్టము నెఱవేఱినది. నాపన్నుగడ సాగినది. సంతోషము సంతోషము. ఇఁక నేను నాపర్ణ శాలకుఁ బోయెద. [హారము మదనసాయక చేతినుండి లాఁగికొనుచు] ఈహారము మరల ఋతధ్వజున కిచ్చివేయ వలెనుగదా? హారమా! నీకెంతయుఁ గృతజ్ఞుఁడను. ఒకసారి నాగ్రీవమునుగూడ అలంకరింపుము. [అని కంఠ మందు ధరించుచుఁ దాళకేతు నుద్దేశించి] అన్నా! నీ తమ్ముఁడు నీ ఋణము దీర్చినాఁడు. వానిని దీవింపుము.

[అని నిష్క్రమించును.

స్థలము—తపోవనము : రంగము—తూర్యకేతుని పర్ణకుటీరము.

[నిద్రితుఁడు ఋతధ్వజుఁడు ప్రవేశించును ]

ఋత—[ఉలికిపడి లేచి] ఛీఛీ! ఏమిపాడుకల!

ఉ. చక్కని చుక్క నా మదన ♦ సాయక కేళి వనంబులోన నేఁ
డొక్కతె పూలుకోసికొను ♦ చుండ నిశాటుఁ డొకం డదెట్టులో
అక్కడి కేఁగుదెంచి చెలి ♦ యఁగ విషబాణముచేత నొంపఁ దా
నక్కట! నేలఁగూలెనఁట ♦ "హా ప్రియ!" అంచు నిదేమిపాపమో!

అయ్యో! ఇట్టి దుస్స్వప్నము నాకెన్నఁడును రాలేదే? నా ప్రాణేశ్వరికి ఎట్టి యపాయము వచ్చియుండదుగదా? మగుడ నగరికి మరలుదునా? [ఇంచుక యోజించి] అట్లు చేయరాదు. అదియే అమంగళ సూచకమగును. ఇంతకును ఇదియొకఁ స్వప్నము. మనోవికారము. దీనికేమి? ఏలాకో? మునీశ్వరుఁడు ఇంకను వచ్చుటలేదు? నేఁడు నాప్రయాణము గతియేమి? [తెరవంక నిర్వర్ణించి] ఇదుగో వచ్చు చున్నారు.

[అంతట దూర్యకేతుఁడు ప్రవేశించును.]

తూర్య—[వానిని డటిసి] కుమారా! ఇప్పుడే వచ్చు చున్నాఁడను. నీకతన నేఁడు నాకు మనోభీష్టసిద్ధి అయినది. ఇదే నీ హారముఁ గైకొనుము.

[అని హారముఁ మెడనుండి తీసి యిచ్చివేయును.

ఋత—[అందికొని] మునివరు ననుగ్రహము. మునీంద్రా! ఇఁక నాకు సెలవొసంగిన గాలవాశ్రమమునకుఁ బోయెద.

తూర్య—ఇదియేమి కుమారా! భోజనము లేకయే ప్రయాణమా?

ఋత—మునీంద్రా! నే నిప్పుడే ఆరగించితిని. తమ జపము పూర్తియగుట విలంబ మగుననియు, ముందుగ నేను భుజించుటకుఁ దమ రానతిచ్చితిరనియుఁ జెప్పి తమశిష్యులలో నొకఁడు ఇప్పుడే నన్ను భోజన పరితృప్తుం జేసెను. తాము ఇంకను రాకుండుటచే మరల శయనించితిని.

తూర్య—[స్వగతము] సెబాసు! నాశిష్యుఁడు ఎంతగడుసరి! నా పనువు ఎంతబాగుగ నెఱవేర్చినాఁడు! ఇఁక నీతఁడు శీఘ్రముగ నా ఆశ్రమమునుండి తరలుటయే మంచిది. లేనిచోఁ బ్రసంగవశమ్మున ఎట్టియనుమానమునకుఁ జోటు చిక్కినను దప్పక నాకుఁ బ్రాణహాని కల్గును. కావున ముందితనిని వీడ్కొల్పి ఆవల నారగింతునుగాక. [ప్రకాశము] కుమారా! నా జపము దీక్షవలనకుఁ జాలదడ వగునని నిన్ను ముందుగ భుజింపుమంటిని. నీవట్లొనర్చి నామాట మన్నించితివి. నీవిఁకఁ బ్రయాణమగుము. ప్రొద్దు గ్రుంకక మున్నే గాలవాశ్రమమును జేరుదువు.

ఋత—మునివరునాజ్ఞ. పోయివచ్చెదను.

తూర్య—వత్సా! నాకనులకు నిన్ను మరలఁ గనుభాగ్యము ఎప్పుడబ్బును?

ఋత—మహాసీయా! గాలవునిఁదోడ్కొని మరలఁ దమ యాశ్రమమునకు వచ్చెదను.

తూర్య—సంతోషము సంతోషము. [తనలో] అంతదనుక నా యాశ్రమము ఉండినగదా?

ఋత—మునీంద్రా! నాకు సెలవొసంగుఁడు. ఇదే నా ప్రణామము. [అని ప్రణమిల్లును.

తూర్య—నాఅమోఘాశీర్వచనము. కుమారా! పోయిరమ్ము.
[ఋతధ్వజుఁడు నిష్క్రమించును.

పాపము. నా మాయాచేష్టలు ఇతని కేమియుఁ దెలియవుకదా? ఇతఁడు పరాక్రమవంతుఁడఁట. నా ధీవిశేషము ముందట ఇతని పరాక్రమేమయినట్లు? నాయన్న నాయంతటి ఉపాయశాలి కాకయేకదా పరలోకమున కరిగినాఁడు? ఇపుడు ఈ ఋతధ్వజుఁడు గాలవునిఁ దన వివాహమునకుఁ దోడ్కొని పోవునఁట. కాని తాను ఇలుసేఱువఱకు తన ప్రియురాలు యమసదనము చేరునని యెఱుంగఁడు. ఓహో వెడగుఁదాంసులారా! మీ పొగడ్తలకు ఉబ్బెడు ఈ వెడగుఁ గుమారుని గతి ఏమిచెప్పెదరు?

ఉ. దానిప హరివాహ ప్రభ ♦ దక్షుఁ డటంచును రాక్షసేభ పం
చాననుఁడంచు రాత్రిచర ♦ శైల దివస్పతి యంచు మీర లీ
మానవనాథ పుత్రుఁ బలు ♦ మారు నుతింతురు గాదె! ఇష్ట ప్రా
ణానిలశిష్టయైన సతి ♦ నాతని కెట్టులు తేఱ్చి యుత్తురో?

ఇఁక నీయాశ్రమము నాకేల? [పర్ణశాలనుద్దేశించి] ఆశ్రమమా! మాయమగుము. [పర్ణశాల యదృశ్యమగును.] ధన్యోస్మి! ధన్యోస్మి! [అని నిష్క్రమించును.

---

స్థలము—నాగలోకము : రంగము—అశ్వస్థుని మందిరము.

[విశోకుఁడు ప్రవేశించును.]

విశో—[వ్యసనముతో] అహో విధికృతము! మిత్రుని అభ్యుదయమునకు సంతసించి అనుశ్రుతాచారము బట్టి మా మందిరమున జరుగనున్న అతని వివాహప్రారంభోత్సవమునకు జనకునిపంపునఁ జక్రవర్తి కుటుంబమును బిలువఁ బోయిన నేను మిత్రుని మరణవార్తతో మరలి రావలసి వచ్చినదికదా? ఓ అయోధ్యాపట్టణమా! నీ కెంతలో ముండమోఁపితన మమరినదే? నీపౌరులలో నెవరిమోము చూచినను మేరలేని విషాదమునే సూచింపుచున్నదిగదా! వారి అన్యోన్య సంభాషణమే తఱచు వినవచ్చుటలేదు. ఒకవేళ మాటలాడిరో, "సార్వభౌముని కెట్టి కష్టము వాటిల్లినది!" "త్రిజగద్భూషణుఁడగు యువరాజునకు ఎట్టి అపమృత్యువుకల్గెను!" "ఆహా! యువరాజపత్ని ఎంత మందభాగధేయ!" అను పలుకులుతప్ప వేఱు ప్రసంగ మెందును వినరాదుకదా? సరియే? నాకర్తవ్యమేమి? దివ్యజ్ఞానియగు నా జనకున కీవార్త తెలిసియే యుండును. కాని నావిధి నేనొనర్పవలెను. ఇఁక నాతని వద్దకుఁ బోవుదునుగాక. [నిర్వర్ణించి] అతఁడే యిటు వచ్చుచున్నాఁడే?

[అంత నశ్వస్థుఁడు ప్రవేశించును.]

అశ్వ—విశోకా! అయోధ్యకుఁ బోయివచ్చితివా?
విశో—జనకా! అవును.
అశ్వ—సార్వభౌమునిఁ జూచితివా?
విశో—చూచియే వచ్చినాఁడను. కాని ...
అశ్వ—[అర్థోక్తిలో] తనయుఁడు ప్రాతినొందెనని కలగుండు పడియున్నవాఁడుగదా?
విశో—జనకా!

గీ. రాజనందన మరణ వా ♦ ర్తా గతిప్పు
తాఁకు వడినంత నలపుర ♦ న'క ప్రీలి
జనము శోకాగ్ని లోఁబడి ♦ మునిఁగి తేలు
చండెఁ దన్నాయకుఁడు కల ♦ గుండు వడఁడె?

ఇంతియ కాక మఱియొకవింత. కుమారుని మరణవార్త నొల్లి తమకుఁదెలుపక మదనసాయకకు దెల్పుటేమి యనియు, దాను దెచ్చినహారముతో మరల నతఁడు మాయమగుటేమి యనియు, మునిమాటలను అంతగా విశ్వసింపక సార్వభౌముఁ డిపుడు తేఁకువగల కొందఱుభటులను గాలవాశ్రమమునకుఁ బంపినాఁడఁట.

అశ్వ—వారేమి వార్తను గొనితెచ్చిరి?
యశో—నేఁటి యుదయమేకదా వారు పోవుట? ఇంకెవ్వరును రాలేదు. వచ్చినను మేలివార్తను దేఁగలరే?
అశ్వ—తనయా! నేనిపుడే సార్వభౌమునిఁ జూడఁ బోవల యును. ఋతధ్వజుఁడు సేమముగానే యున్నవాఁడు. నీవు చెప్పిన కపటమునియే తేనిని వంచించి సంక్షోభమొద వించెను. నీవును రమ్ము. పోవుదము.

విశో—[ఆశ్చర్యముతో] హా! ఏమివింత యేమివింత! నా సఖుఁడు క్షేమముగా నున్నాఁడా?

అశ్వ—అవును. నేనిప్పుడు దివ్యదృష్టిని దెలిసిన విషయము వినుము. తూర్యకేతుఁడను ఒకరాక్షసుఁడు ముని వేష ధారియై మాయాకుటీర మొక్కటి కల్పించుకొని గాలవ మహర్షిని జూడఁ బోవుచున్న యువరాజును సంభావించి అతని కంఠహారమును సంగ్రహించి తనమాయాబలముచే తేని యనుజ్ఞగొని మదనసాయకా శుద్ధాంతమునకుఁజని, ఆమెతో "నీ మగఁడు రక్కసులచేఁజిక్కి మృతినొందినాఁడు. నిదర్శనముగ అతనికంఠహారమును దెచ్చితిని. కైకొమ్ము" అని చెప్పగా దానింగని ఆమె మూర్ఛిల్లెను. అంతట ఆ మణిహారముతో మరల దన యాశ్రమమునకు వచ్చి ఋతధ్వజుని వీడ్కొలిపెను. ఋతధ్వజుఁడు ఇపుడు గాలవాశ్రమముననే ఉన్నవాఁడు. ఇదియంతయు ఒక గడుసు పన్నుగడ. రమ్ము రమ్ము. పోయి సార్వభౌముని మగుడ ఆనందసాగరమునఁ దేల్పుదము.

[అని విశోకునితో నిష్క్రమించును.

స్థలము—సాకేతపురి : రంగము—రాజప్రసాదము.

[శత్రుజిన్మహారాజు ప్రవేశించును.]

శత్రు—[విచారముతో] గాలవాశ్రమమునకుఁ బోయిన భటులు ఇంకెవ్వరును రాలేదఁట. సరియే. వచ్చెదరు. వచ్చిననేమి? నా ఋతధ్వజకుమారునిఁ దోడ్తెత్తురా! వాని క్షేమసమాచారమైనఁ గొనితెత్తురా? లేదు లేదు

లేదు. నాకుఁ దెలియును; నాకుఁ దెలియును. వారు తెచ్చెడిది మరల మరణవార్తయే. మా బుత ధ్వజుఁడు చనిపోయినాఁడా? తుదకు అసురులు వానిని జయించిరా? హా! హా! హా! ఎంతపని యయ్యెను! ఎంతపని యయ్యెను! హా కుమారా! నిరుపమశూరా! నీకా దుర్మరణము? సాధుజనావనోత్సాహివై త్రిజగత్కంటకులగు రాక్షసుల నెల్లను రూపుమాపి నా కీర్తికి వన్నెదెచ్చుచుంటివని నేను ఎంతయో మనమున నుప్పొంగుచుండ ఇపుడీ పాతురక్కసుఁడు ఎక్కడ నీకు దాపరించినాఁడు? హాతవిధీ! శూరశిఖామణియగు నా చిట్టితండ్రిని దుదకొక పొలసుదిండిచేతనా చంపింతువు? ఓహో! ఏమి నీ ధీజడిమ? ఓయీ పుత్రరత్నమా! గాలవుఁడు నిన్ను వెండియుఁ దనయాశ్రమమునకు రావించుట నీ చావుకొఱకా? ఓయీ గాలవమునీంద్రా! నీకిదే నమస్కారము. నా తనయుని బ్రతికింపుము. తొల్లి నీవేకదా నాకుమారుని అసురసంహారమునకు వెంటఁగొని పోయితివి? ఓ సకల మునిపుంగవులారా! ఇదే నాప్రణామ మందికొనుఁడు. నాబుతధ్వజునిఁ బునర్జీవితుని జేయుఁడు. రాక్షసభయ మెడలించి మిమ్ముల నందఱను బ్రోచిన వాఁడు నా కుమారుఁడేగదా? వానిని బ్రతికించితిరేని మరల మిమ్ములఁ బ్రోవఁగలఁడు. కావున మీతపస్సుల నెల్ల ధారవోసియైన నాకుఁ బుత్రదాన మొసంగుఁడు. ఓహోహో! ఏమి నా వెడగుఁదనము! వీరా నా కుమారుని బ్రతికించుట? అట్లయినచో నాకు ఈ ఘోర మరణవార్త మునియేల తెచ్చును? దుర్భ్రమ దుర్భ్రమ!

వీరు కేవలము వేదజడులు. వాక్శూరులు. అయినను నా పాపమునకు వీరి నేఁ వలసిన పనియేమి? హా! ఎంత పనియయ్యెను! ఓసీ మదనసాయకా! నీవెంత యదృష్ట హీనవే? నాకుమారుని మరణముకంటె నీస్థితిఁ దలఁచుకొనిన నాహృదయము నీరై పాఱుచున్నది గదే బిడ్డా! సుగుణములప్రోవా! సౌందర్యరాశీ! హా! ఏమిచిత్రమగు బ్రహ్మసంకల్పము! ఎంతటి దైవోపహతుఁడను! ఎంత పాపాత్ముఁడను! ఎంత మందభాగ్యుఁడను!

[అని నిటలము కేలిపైనునిచి నిశ్వసించుచుండును.

[అంతఁ బ్రతీహారుఁ డొకఁడు ప్రవేశించును.]

ప్రతీ—[స్వగతము] వీరెవరో ఉత్తమవంశ్యులవలెఁ దోఁచుచున్నారు. కాని ఏలిక దర్శనము ఇప్పుడే చేయుదురఁట. సార్వభౌముని ఆజ్ఞ వారికి నేనెంతదీనతతో విన్నవించినను నామాటలు సరకుగొనక "పోయి ఏలికకు మారాక దెలియఁబఱుపుము. భయపడవలదు" అనియే చెప్పుదురు. నాకేమిమార్గము? సరియే. ఏలిక సన్నిధికే తెంచితినిగదా. ఇఁక నేమైనఁ గానిమ్ము. కాని యిచటనే నిలువంబడెద. ఏలిక నన్ను ఎపుడు కన్నులెత్తిచూచిన అప్పుడే తెలిసెదఁగాక. [అని నిలుచబడును.

శత్రు—[కొంతవడికి, నిర్వర్ణించి] ఓరీ! కుమారుని వార్త, లేమైనఁ దెచ్చితివా?

ప్రతీ—[తెలిసి] లేదు దేవా! నేను ద్వారపాలకుఁడను. గాలవాశ్రమమునకుఁ బోయినవా రింకను రాలేదు.

శత్రు—ప్రతీహారుఁడవా? నిన్నెవరు రావించిరి?

ప్రతీ—[కరములు ముకుళించి] దేవరవారు మన్నింపవలెను. దేవరకుఁ జిరపరిచితులఁట. నాగలోకవాసులఁట. అశ్వస్థుఁడను నతఁడును, అతనికుమారుఁడును ఏలికదర్శనమునకై వచ్చి హజారమున వేచియున్నవారు. కావారుని సమాచారము రూఢిగఁ దెలియువఱకును జాము ఎవ్వరికిని దర్శనమీయరని వారితో ఎంతచెప్పినను నామాట బెడ చెవినిబెట్టి 'పోయి మారాక ఏలికకు విన్నవింపు' మనిగో చెప్పిరి. కార్యగౌరవము ఎట్టిదోయని భయపడి తమ సన్నిధికి రా సాహసించితిని. అటుపైని ఏలికచిత్తము.

శత్రు—ఓరీ! ఎవరు వచ్చినారని చెప్పితివి?

ప్రతీ—దేవా! నాగలోకవాసియగు అశ్వస్థుఁడును, అతని కుమారుఁడును.

శత్రు—[ఉలికిపడి] అశ్వస్థుఁడా? నా ప్రియమిత్రుఁడా? ఓరీ! వానిని వెంటనే కుమారునితోఁ బ్రవేశపెట్టుము.

ప్రతీ—దేవర ఆజ్ఞ. [అని నిష్క్రమించును.

శత్రు—దివ్యజ్ఞానియు, మహాయోగియు, మహామంత్రవేత్తయు నగు నామిత్రుని నాగరాజును గనుటచే నామతి నేఁడు కొంత నిర్వృతి చెందును. రానిమ్ము రానిమ్ము.

[అని నిర్వర్ణించును.

[అంత నశ్వస్థుఁడను, విశోకుఁడును బ్రవేశింతురు.]

శత్రు—[లేచి] మిత్రరత్నమా! ఈ మందభాగ్యునిఁ జూడ వచ్చితివే? రమ్ము. ఇచట సుఖాసీనుఁడవు కమ్ము. [విశోకు నుద్దేశించి] కుమారా! నీవయస్యుని జూడ నే తెంచితివా?

నేఁడు ఈమంద భాగ్యుని సత్కారమే నీవు గ్రహింపవలయు. ఇచటఁ గూర్చుండుము. [అందఱు గూర్చుండిన వెనుక, అశ్వస్థు నుద్దేశించి] మిత్రమా! నీకుఁ గుశలమే? ఈపాపాత్ముని ఏల చూడ వచ్చితివి?

అశ్వ—సఖా! ఏమి యిట్లనెదవు? నీయట్టి పుణ్యాత్ముఁడు వేఱొకఁడు నాకుఁ గానరాఁడు. మఱియు, మనకు అందఱకుఁ గుశలముకాదా?

క. కుశలము పో ఋషిధ్యాన • కుశ సఖ! గాలవు నాశ్రమమ్మునఁ ;

శత్రు—[లేచుచు, నివ్వెఱఁగుతో] ఆఁ! ఆఁ! ఏమియేమి యేమి!

అశ్వ—[లేచుచు, మరల నదియే చదివి, పిమ్మట]

కుశలము నీకు నీ హితుల • కున్ సఖ! ఇప్పు భవద్గృహమ్మునన్;
కుశలము నాకు నాసుతున • కుం సఖ ఇప్డు త్వదీయ సన్నిధిన్;
కుశలము కాదె మన్త్రియు స • ఖుం డిపుడేలఁగ నెల్లవారికిన్?

శత్రు—మిత్రమా! చెప్పుము చెప్పుము. కుమారుఁడు సేమముగా నున్నాఁడా?

అశ్వ—అవును సఖా! నీవు విచారింపకుము. అతఁడు ఇపుడు గాలవుని సన్నిధి నున్నవాఁడు.

ఆ. భాగ్యకేతుఁడనెడి • తులువ దైత్యుఁ డొకండు
మౌని యాగుచు నీకు • మారుఁ డరుల
చేఁ జిక్కె ననుచుఁ • జెప్పె; దబ్బర సుమ్మి;
దీనిఁ గంటి నే న • దృష్టి నిపుడు.

శత్రు—ఓహోహో! ఏమి యద్భుతము! ఏమి మోసము! రాక్షసుఁడు నా అంతఃపురముఁ జొచ్చెనా! ఏమివింత!

వయస్యా! నేను ఆమాయావిని విశ్వసింపకయే కుమారుని కై గాలవాశ్రమమునకు భటులను బంపినాఁడనుజుమా? కాని వారెవ్వరును ఇంతవఱకురాలేదు.

అశ్వ—మిత్రమా! ఋతధ్వజుని దోడ్కొనివారువత్తురు. గాలవమహర్షికూడ వానితో వచ్చును. కావున నిర్ణీత దినముననే కుమారుని పరిణయోత్సవంబు నిర్వర్తింపుము.

శత్రు—వయస్యుని ఆజ్ఞ. ఔరా! నేఁడెట్టిసుదినము! నా మిత్రుని గంటిని. నాపుత్రుని క్షేమవార్త వింటిని. నా సంతోషమును ఎట్లు మఱుఁగు పఱతును? ఓరీ! ప్రతీహార! వేగ మిటురమ్ము.

ప్రతీ—దేవా! వచ్చినాఁడను.

శత్రు—ఓరీ! నీవు వైశమపోయి అంతఃపురపాలకులతో, "కుమారుఁడు క్షేమముగ గాలవాశ్రమమున నున్నవాఁడు. కొండొక కపటతాపసిమాటలు మమ్ము మోసపుచ్చినవి." అని మా మాటలుగ దేవితోఁ జెప్పుమనుము. మదన సాయకకు ఈ యుదంతము దెలిపి వెంటనే సమాహితాత నొసర్పుమనుము. వెనుక గోపురపాలకుని కడకుఁ బోయి ఇదేవార్త పట్టణమందంతటను శీఘ్రముగఁ జాటింపు మనుము. పదపడి కుమారుని వివాహమునకై అరుదెంచిన మా బంధుమిత్రులకు అందఱకును ఈవార్తనే సెప్పు స్వయముగఁబోయి వేర్వేఱుఁగ నెఱింగింపుము. పొమ్ము. నేఁడు మాకువలెనే అందఱకును ఒక్కమాఱుగా అమితా సందము కలుగవలయు.

ప్రతీ—పలిక ఆజ్ఞ. పనివినియెదను.

శత్రు—పొమ్ము. వేగమ పొమ్ము. నీకొలువు వేఱొకని కప్పగింపుము. మఱియు నేఁడు మాదర్శనము ఎవ్వరికిని దుస్సాధము కాఁగూడదు.

ప్రతీ—మహాప్రసాదము. [అని నిష్క్రమించును.

శత్రు—మిత్రమా! నిన్ను జాలకాలమునకుఁ గంటిని. పరమేశ్వరుని రాకవలె నీరాక నాకు ఎంతయు మంగళప్రదమైనది. నేఁడు నాకు మిక్కిలి సుదినము. రమ్ము కూర్చుండుము. కుమారా! నీవును కూర్చుండుము. వయస్యా! నీవు నాకుఁ బుత్రిదాన మొసంగితివి. నీయభీష్టమే కానిమ్ము. వచ్చినబంధువులు ఎవ్వరును బోలేదు. నాపాలిఁటి భాగ్యదేవతవు నీవును దోతెంచితివి. కుమారుని వివాహకార్యము తప్పక నిర్వర్తింపుదము. కాని మిత్రమా! ఋతధ్వజుని మరల ఎప్పుడు చూతును? వానికై పోయిన సేవకులు ఇంకను రారేమి? వివాహదినముకూడ సమీపించుచున్నదే? మరల గాలవాశ్రమమునకు భటులను బంపుదునా? [అని యోజింపుచుండ]

[ఒక వృద్ధకంచుకి యింకొకవైపునుండి ప్రవేశించును]

కంచు—[స్వగతము] ఎటులీఘోరవార్త సార్వభౌముని కెఱింగింతును? నేఁటికి ఈ ముసలికాలమునకు దైవము నాకు ఎట్టిపని గల్పించెను? అక్కటా! గోరుచుట్టుపై రోకటిపోటువలెఁ గుమారుని మృతికై మున్నే సంక్షోభించుచున్న ఏలిక హృదయము ఈ దుర్మరణ వార్తచే మఱుడఁ గలంపవలసి వచ్చినది. కానిమ్ము. విధి అచర్వణీయముగదా? [నిర్వర్ణించి] సార్వభౌముఁ డిచ్చటనే

యున్నాఁడు. అయ్యో! నా నాల్క తడఁబడుచున్నది.

[అని నిలువఁబడును.

శత్రు—[నిర్వర్ణించి] ఎవరా వచ్చుచున్నది? కంచుకియా! [వానినుద్దేశించి] ఓరీ కంచుకీ! ఏలవచ్చితివి? దేవి సమాశ్వసిల్లినదా?

కంచు—[కరములు ముకుళించి] దేవా! ఈ మందభాగ్యుని ఏలిక క్షమిం- క్షమింపుదురుగాక. దేవి - దేవిగారే నన్నిపుడు ఏలిక సన్నిధికిఁ బుత్తెంచిరి.

శత్రు—ఏమోయి నీ తడఁబాటు? ఏమివార్త దెచ్చితివి?

కంచు—దేవా! రాజ్ఞిగారు ఏలిక కీ ల్లు నివేదింపుమనిరి. "యువరాజపత్ని—మదనసాయక—

శత్రు—[లేచుచు] ఏమి మదనసాయకకు? కుమారుని క్షేమవార్త నామెకు వినిపించిరా?

కంచు—"—మదనసాయక ఇప్పుడే ప్రాణములు విడిచినది. శుద్ధాంతము ఘూర్ణాయమానమై యున్నది"

శత్రు-[అత్యాశ్చర్యముతో] మదనసాయకా? అయ్యో! అయ్యో! అయ్యో! [అని యాసనముపైఁ గూలిపడును.

అశ్వ—హా! ఎంతకష్ట మెంతకష్టము!

విశో—ఆహా! వయస్యునికి ఎంతటి విపత్తు! హా సుహృద్రత్నమా! [అని ఏడ్చును.

శత్రు—[కొంతవడికి, కంచుకి నుద్దేశించి] ఓరీ! నీవేమంటివి? మదనసాయక చనిపోయినది! బుతధ్వజుఁడు సేమముగా

మన్నాఁడు! తొల్లి ఋతధ్వజుఁడు చనిపోయెనా! అప్పుడు మదనసాయక సజీవయా? తుదకు విధి చేతి కీల్బొమ్మ నైతినా! నా ప్రాణమునకు కిఁక నిర్వృతి లేదా! కుమారుని అర్ధాంగలక్ష్మి ఇట్లయ్యెనా! [అని కన్నీరు నించును.

అశ్వ—[శత్రుజిత్తు హస్తములు పట్టుకొని] మిత్రమా! నీవిట్లు చేయఁజనదు. సమాశ్వసిల్లుము.

శత్రు—వయస్యా! నేను పాపాత్ముఁడను. నేను పైనోప పాతుఁడను. నా మోము చూడకుము.

అశ్వ—మిత్రమా! విధినిర్ణయమిట్లుండ లోకరీతిని ఎట్లుజరుగును? సర్వంసహాచక్రము నేలెడి నీవు ఇట్లు శోకింపుచుండిన ఎవ్వరోదార్పఁగలరు? సమాశ్వసిల్లుము. అసురుని ధూర్త వచనంబులు పాపమా అతికోమలహృదయకు దుర్భరమై మరణమొదవించినవి. అహా విధికృతము!

శత్రు—మిత్రరత్నమా! మందభాగధేయుఁడను. నీవు నాకు దైవమవు. పుత్రశోకము వాపితివి. నాకొడుకును నాకొసంగితివి. అటులే నాకోడలిని నాకు అనుగ్రహింపుము. ఈ మేటి విపత్తును గడదేర్పుము.

అశ్వ—[తనలో] ఆహా మానవేశ్వరుని కొండలపాటు! [ప్రకాశము] సఖా! ఊరడిల్లుము. విధి బలీయము కాదా! అటులే కానిమ్ము. ఊరడిల్లుము.

[అంతలో నొక చేటి ప్రవేశించును.]

చేటి—జగదీశ్వరులు ఈ దీనురాలి విన్నప మాలింపవలయు, మదనసాయక మరణముచే దేవిగారిదుఃఖము ఇనుమడించి

నది. ఇంతలోఁ గుమారుని క్షేమవార్త తెలిసినది. అప్పటినుండియు శోకము ముమ్మరమై దేవిగారు కోడలి పైఁబడి మోఁదుకొనుచు రోదనము సేయుచున్నారు. ఇంతి వఱకును ఆమె కొంచెమైనను దెప్పిఱిల్లలేదు. మే మెవ్వ రమును దేవిని బట్టఁజాలకున్నాము. కావున ఏలిక శీఘ్ర ముగ విచ్చేయవలయును.

శత్రు—హా దైవమా! నీ పరిపంథినగు నాకు ఇంకను ఎట్టి యుపద్రవములఁ గూర్పనెంచితివో? కానిమ్ము కానిమ్ము. [లేచుచుఁ, జేటితో] చేటీ! అంతిపురికి దారిఁజూపుము.

చేటి—దేవా! ఇటుయిటు.

[శత్రుజిత్తును, కంచుకియు, చేటియు నిష్క్రమింతురు.

అశ్వ—అక్కటా! ఈచక్రవర్తి దీనవృత్తిగనిన హృద యము నీఱగుచున్నది. ఈ మహానీయుఁడిపుడు తన్నుఁ దానుఱచి యున్నాఁడు. ఇతనికి వెండియుఁ జిత్తవృత్తి కుదురుటెట్లు?

విశో—జనకా! సార్వభౌముఁడు కోడలి ననుగ్రహింపుమని వేఁడగా అట్లేయంటివి. నీవచనము అమోఘముకదా?

అశ్వ—[కొంతవడి కాలోచించి, తనలో] సరియే భూపతి యనుతాపము బాపెడి మార్గమే ఆలోచింపుదు. నా ప్రియమిత్రుని ఆత్రము దీర్పఁజాలని నా మాహాత్మ్య మెందులకు? [ప్రకాశము] తనయా! సీఘ్రసవేయగును లెమ్ము. సార్వభౌముఁడు మరల వచ్చువఱకును సౌధాం గణమున నుంకము రమ్ము.

[అని విశోకునితో నిష్క్రమించును.

స్థలము—మునుపటిదే : రంగము—అంతఃపురము.

[వృద్ధకంచుకి ప్రవేశించును]

కంచుకి—అహా! ఏమి కాలమహిమ! పోతుటీఁగయైనఁ జొరకుండ శుద్ధాంతమును గాపాడఁగలిగిన యీ కంచుకి నేఁటికి వృద్ధుఁడై రాక్షసులనుకూడ నిపు డంతఃపురమునఁ బ్రవేశ పెట్టుచున్నాడు. అక్కటా! మదనసాయక మరణించినదా? ప్రాణరహితమైనను షోడశ కళాపూర్ణమగు చంద్రబింబమువలె వెలుఁగుచున్న యామె కుసుమకోమల శరీరము మఱి యీ పాడు కనులకుఁ గనఁబడదుకదా! నా మాటకేమి? గాలవాశ్రమమునకుఁ బోయిన యువరాజ కుమారుఁడైన నొకసారి కనులారఁ జూడకుండ ఆమెశరీర మిట్లు మటుమాయమగుట కంటె వేఱొండు కష్టమేమున్నది! మాయావియగు ఆ తాళకేతు హతకుఁడే యిట్లొనర్చి యుండునని చేటికకూడ చెప్పుచున్నది. ఆమెయు, నేనును ఎంత మెలఁకువతో నున్నను ఒక్కరాత్రియైన ఆమె శరీరమును మేము కాపాడలేక పోయితిమి. ఈవార్త తీసికొని ఆమె దేవిగారియొద్ద కప్పుడే పోయినది. [ఊర్ధ్వ మవలోకించి] ఇంకను సరిగా తెల్లవాఱుటగూ లేదు. శోకసంతప్తురాలగు దేవిగారికి మాత్రము నిద్రయెట్లుండును! మా అప్రమత్తత తెలియక మా యిర్వుర నామె శిక్షార్హులుగ నెంచునేమో? కాటికి కాళ్లుచాఁచుకొనియున్న నాకు ఏలిక మరణశిక్ష విధించుటే మేలగును. త్రిజగన్మోహిని యగు యువరాజపత్ని మరణము కన్నులారఁ జూచిన

నాకు మఱి జీవింపవలెననెడి ఆశలేదు. [నిర్వర్ణించి] ఇదే చేటివచ్చు చున్నది. ఏమివార్త తెచ్చెనోకదా ?

[చేటి ప్రవేశించును. ఆ మెుఖముచూచి]

చేటీ ! మన యిరువురకును రాణిగారి పనుపున ఏలిక యెట్టిశిక్ష విధించిరో వెంటనే చెప్పుము.

చేటి—నుసము దండనార్హులము కామని ఏలిక నిశ్చయించిరి. మదనసాయక అదృశ్యమైన వృత్తాంతము వినికూడ వారిరువురును వెండియుఁ గలఁత నొందలేదు. అంత ముమ్మరమైన దుఃఖములో వారు మునిఁగి యున్నారు. ఇది రాక్షస కృత్యమేయని యేలికయు, రాణియు ఏకాభిప్రాయముతో నున్నారు. కావున మనము బ్రతికిపోయితిమి !

కంచుకి—బ్రతికియుండిన లాభమేమి ? చేటీ! యువరాజు గాలవాశ్రమమునుండి వచ్చిన వెనుక తన ప్రాణేశ్వరికై పొందెడి అతని పరిదేవనము వినకుండ మరణింపవలయు ననియే నాకుఁ గోరికగలదు.

చేటి—అవును. అతనిదుఃఖము చూచుట కష్టమే. రాణిగారు కూడ తనకోడలు మాయమగుటకు దుఃఖింపలేదు కాని అందువలనఁ దనపుత్రునికిఁ గలిగెడి అమితదుఃఖమును దలఁచుకొని కొందలపాటు నొందుచున్నారు.

కంచుకి—యువరాజు నేఁడేవచ్చునని వింటిని. అతని మొగము నేనెట్లు చూడఁగలను? [కొంతతడవాఁగి] కాని యిది చెప్పుము చేటీ! యువరాజపత్నిని చూడవచ్చిన రాజదంపతులును, వారి బంధుమిత్రులును నిన్న చీఁకటిపడువఱకు

మాత్రమే మనతోనుండిరికదా? వారు వెడలిపోయిన వెనుక మనము కనుఱెప్ప వేయక మదనసాయక మందిర ద్వారమునొద్దనే కావలియుంటిమికదా? మనముచూడ కుండ రాత్రియెవరు మందిరమునఁ బ్రవేశింపఁగలరు?

చేటి—ఎవరును లోనికిఁబోలేదు. కాని నిశీథసమయమున నొక వింతవెలుఁగు గగనవీధినుండి అవతరించి మందిర ద్వారముదాఁటి లోనిక్రిబవేశించుట కంటిని. అంతకు ముందు మదననాయక శరీరమునుండి వెడలినప్రాణమే తేజోరూపమున మఱల నా శరీరమునఁ బ్రవేశించుచున్న దనియు, ఆమెతప్పక బ్రతుకఁగలదనియు నే నేదో ఒక ఆలోచనలో నుండగా నాకు స్మృతితప్పినట్లయినది. మఱల నేను కనులువిప్పి చూచుసరికి యువరాజుపత్ని శరీరము మాయమయ్యెనని చెప్పుచుండిన నీ వాక్యములే నాకు వినఁబడెను. నా కప్పుడు కలిగిన కలవరములో ఈ విషయము నీకుఁజెప్పుట మఱచితిని.

కంచుకి—రాక్షసమాయ నా స్మృతినికూడ చెఱచినట్లేకదా? కాని చేటీ! రాజదంపతులు మఱి యిచటికి రారనియే నా నిశ్చయము. నే నెందులకిచట? పోయి వారిదర్శనము చేసికొందును.

చేటి—నాకుమాత్ర మిచట నేమిపనియున్నది? నేనుకూడ నీవెంట వచ్చెదను పద. [ఇద్దరునిష్క్రమింతురు.

---

# మదనసాయక

## పంచమాంకము.

స్థలము.—నాగలోకము : రంగము—అశ్వస్థుని మందిరము.

[ విశోకుఁడు ప్రవేశించును. ]

విశో—[విచారముతో] అకటకటా! వయస్యుఁడు ఎంతటిలో వాడి వత్తలయినాఁడు. అవును. వహ్నిలేకయే చిత్తమును దహింపఁజేసెడి భార్యావియోగ దుఃఖము ఎవరి నట్లు చేయదు? అందు తనకుఁ గూర్చెడిసతి గతించెనేని ఇఁకఁ జెప్పనేమున్నది? మదనసాయకను దలఁచుకొనుచు ఋతధ్వజుఁడు ఒడలుమఱచి ఆక్రందించుచుండ నా కనులవెంట నశ్రుకణములు తమంతటఁదామే రాలఁజొచ్చినవి. సార్వభౌముఁడును, ప్రధానులును, బరిచారకులును దన్నెంత బతిమాలినను రాచనగరు ప్రవేశింపక యొల్లి మదనసాయక విహరించెడి ప్రమదావనమున విడిసియున్నవాఁడు. గాలవముని తప్ప అన్యులెవ్వరును దనయొద్ద నుండుటకు ఇయ్యకొనలేదు. మౌని యూఱడింపులచే అతనికి ఒక్కింతయైన దుఃఖోపశమన మయినట్లు కానరాదు. అతని పరిదేవన మెవరు విన సహింతురు? వయస్యుఁ డిట్టిస్థితియందుండునని జనకుఁ డెఱుంగఁడా? అయ్యయ్యో! వయస్యుఁ డెన్నఁడు మరల ప్రసన్నత నొందునో కదా? జనకుని కతనిపై నెప్పుడు కరుణగల్గునో కదా? ఆహా! కళత్రనష్ట మెంతకష్ట మెంత కష్టము! పగవానికైన అట్టికష్టము రాకుండునుగాక.

సీ. ఇంటఁబండుకొని న • ట్టేట మేల్కొనినట్లు
లదనన గృహదీప • మాఱినట్లు

కష్టార్జితంబు దొం ♦ గల పాలఁబడినట్టు
　　బాలయౌత్సంగమ్ము ♦ కూలినట్లు
ప్రాణమిత్రుఁడు చెల్లె ♦ నను వార్త వినినట్టు
　　లఖిలశరీరము దగ్ధ ♦ మైనయట్లు
దారి మిట్టెండ చ ♦ క్రము తున్కలైనట్లు
　　గొప్ప చీఁకటి బావి ♦ గూలినట్టు
లుండునంగురు భార్యా వి ♦ యోగ మొంది
నట్టి వాని మనస్సున ♦ కట్టు గాన
నెవనికైనఁ గళత్ర వి ♦ హీన వృత్తి
కంటె వేఱొండు చెప్ప దుః ♦ ఖమ్ము గలదె?

ఈ యుదంతము జనకున కెఱింగించి అతనిని నామిత్రుని జూచుటకుఁ బ్రయాణము చేయింతును గాక.

[అని నిష్క్రమించును.

స్థలము—సాకేతపురి : రంగము—ప్రమద వనము.

[ ఋతధ్వజుఁడు ప్రవేశించును. ]

ఋతు—

సురుచిర వృత్తము.

హా! పయోజ విలాసినీ! అ ♦ హా! సతీమణీ!
భావజాంగనా సమాన! ♦ వామ లోచనా!
జీవ మెట్లు వాసి తీవు ♦ జీవితేశ్వరీ!
పైవ మయ్యె నీకు నాకు ♦ దారుణ యయ్యెఁగా!

ఇది స్వప్నావస్థకాదా? ప్రేయసి నిజముగఁ జనిపోయినదా? నన్ను శోకాబ్ధినిఁ గూలఁద్రోసినదా? ఇపుడు నేను మేల్కొనియున్నాఁడను? కడలినడుమనా? కాదు కాదు. బడ

బానల మధ్యమున. అయిన నేనేల ఇంకను గతాసుఁడను గాలేను? [నిర్వర్ణించి] కాదు కాదు. ఇది ప్రమదవనము. మదనసాయక ప్రమదావనమిది. చెలి యింకను రాదేమి? చెలీ! మదనసాయకా! ఓహోహో! ఏమి నా భ్రాంతి! చెలి యెట్లువచ్చును? ఆమె మృతిఁజెందెనని యందఱు చెప్పుచున్నారుకదా? పోనిమ్ము. మరణించిన వెనుకనైన ఆమె జగన్మోహనరూపము నొకసారి చూచుటకు నేనేల నోఁచుకొంటలేను? నన్నుగూర్చియేకదా నా ప్రాణేశ్వరి ప్రాణములు విడిచినది. ప్రేయసీ!

గీ. నేను చనిపోయితినని వి ♦ నిన క్షణమునె
నీవు మరణింపఁగలిగితి ♦ వీవు; కాని
నీవు మరణించితివని వి ♦ నియును నేను
బ్రతికియున్నాఁడ నిఁక; నాది ♦ బాతిగుండె.

నే నెంతటి కఠినుఁడనో నీకిపుడు తెలిసినదిగదా? మఱి నేను మరణింపను గనుక నీదుర్మరణము నాకు ఆజన్మాంత దుఃఖకారణ మెందులకుగాదు? అయ్యయ్యో! గాలవుఁడెంత వెంగలి? నే నెట్లయిన నా ముద్దుగుమ్మను మఱవవలెననికదా అతని యాశయము? అది యెట్లు జరుగును? పేశలాంగీ! నీ యుపవనము విడిచి యేఁగుదునా? ఇట్లుఁజుఁన నా హృదయతాపము దీఱునేమో? ఏమను చున్నావు? తీఱదనియా? అవును నిజమే. ముమ్మాటికి నిజమే. నే నిచటనే ఉందునుగాక. ఆహా! చెలి ఎన్నఁడైనఁ నిచ్చోట విహరించెనా? ఆమె నవయౌవన విలసనంబుల నేనెన్నఁడైనఁ జూచితినా?

సీ. కౌలంగియలు ఘల్లు ♦ ఘల్లని మ్రోయఁగ
నసియాడఁ బూఁదోఁట ♦ కరుగు దెంచుఁ;
జూపుఁగోపు లెసంగ ♦ సుమముల నొకకొన్ని
గ్రంచి తా నలవోఁక ♦ దుఱుము సిగను;
చనవుచేఁ దనచాహు ♦ పున ప్రాలు శుకరాజ
నులఁ గవుంగిటఁ జేర్చి ♦ ముద్దులాడు;
గండు గొయిల తన ♦ గానమ్ము చాలించి
విను రీతి నద్దాని ♦ ననుకరించు;
గునియుఁ నట్టివ పిట్టలఁ ♦ గులుకు లాఁడి
పైఁట జాఱఁగ నెగిచి తాఁ ♦ బట్టు కొన్ని;
ఇట్టి లే జవ్వనపుఁ జెయ్వు ♦ లింక నకట!
చూడఁ బోవు నొకో నాదు ♦ వాడు కనులు?

[లేచుచు] ఈ యమిత తాపము సైఁపజాలను. నా మనము శిథిలమగుచున్నది. శరీరమున మంటలు వొడముచున్నవి. గాలవుఁడరుదెంచువఱకును ఎటకేనిఁ బోయెదఁగాక. [పరిక్రమించుచు] నెచ్చెలీ! నిన్ను మఱి చూడజాలనుగదా?

గీ. పూవు దోఁటను దాఁగిలి ♦ మూఁత లాడ
నేఁకరుదు గదె? ఇపుడల్లె ♦ యే నగమ్ము
చాటునుండియొ కులుకుచు ♦ సరగ వచ్చి
లే నగవు తోడ నునుఁ గౌఁగి ♦ లింప రాదె?

అయ్యో! ఇది వట్టిభ్రమ. సకి యిఁకరాదు. కట్టిఁడి రక్కసుఁడు ఆమెను గొట్టం బెట్టుకొనెను. ఇఁక నలఁతి కాలముంగో నేనే ఆమెకడ కేఁగెద. [మరల బరిక్రమించుచు] ఆహాహా! ఎట్టివి స్మరణకు వచ్చుచున్నవి! [నిరూపించుచు]

ఉ. ఇచ్చటఁగాదె యొక్కపరి ♦ యింతి వయస్యలఁ గూడి యేవియో
. ముచ్చట లాడుకొంచుఁ గడు ♦ ముద్దులు గుల్కెడు పూవుటెత్తులన్

గ్రుచ్చుచు నుండు వేళ నిట ♦ కుఱ్ఱ జను దెంచిన నన్నుఁ జూచి తా
నచ్చెరు వంది చంగున వ ♦ యస్యల చాటున కేఁగి నిల్చె? హా!

[వెండియుఁ బరిక్రమించుచు] ఇది శశికాంత వితర్ది కదా? అయ్యయ్యో! నాకనులకిది ఎంతఘోర ప్రదర్శనము!

ఉ. ఈనెలరాతి తిన్నెపయి ♦ నెన్నియొ సారులు నాకఫంగిటన్
మానుగ నొప్పి తా నిసువు ♦ మాడ్కి మొగమ్మును నా మొగమ్ముపై
నానుచు వేడ్క నా యనున ♦ యమ్ములకుం బ్రతి సెప్పకుండ నా
మానవతీ లలామ గరి ♦ మమ్మున నా సరసన్ వసింపదే?

అక్కటా! ఈ యెలదోఁట నింక నేఁ గ్రుమ్మరఁజాల. ఇందెందుఁ జూచినను ప్రేయసి స్మారక చిహ్నములే తోఁచుచు నాకు హృద్వేదన మొనర్చుచున్నవి. మఱుడి యథాస్థానమున కేఁగెదనుగాక. [అని యట్లొనర్చి, ఆసనము దడివి] అయ్యో! ఇదియేమి? తొలి నా తనుస్పర్శచే దీని కొదవిన వేడిమి ఇంకను శాయలేదే? నే నిచట నెట్లుప వసింపుదు? మరల ఆ చలువరాతికడ కేఁగుదునా? దానిపై గూర్చుండినచోఁ గొంత తాపము తీఱునేమో? ఇస్సీ? తీఱను తీఱదు. ఉపశమిల్లుటకు నాది విరహతాపము కాదు. మరణవేదన. ఇఁక నెచటి కేఁగుదును? సరియే. ఇచ్చటనే ఈ లేఁబచ్చికపైఁ గూర్చుండెద. [అని యట్లొనర్చి] ప్రేయసీ! మదనసాయకా! నీవు లేక నేను కల్లగదా? ఇఁక నేను ఏల జీవింపవలెను? నీయుండకు నన్ను వైళమ కొనిపొమ్ము. లేనిచో, ఈ మనోవ్యథ తీఱు మార్గమే లేదు.

ఆ. తాప మోపఁజాలఁ ♦ దరుణి! నిఱ్ఱ గవియ నా
డెంద మిప్పు డురవ ♦ డించు చుండె;

గాన నొక్కసారి ♦ కలకంఠమున నన్నుఁ
బిలువ రాదె "రమ్ము ♦ ప్రియా!" అటంచు ?

[ అంత నొక కోయిల కూయును. ]

ఋత—[ఆలకించి] అదే! లలితాంగి పిలుచుచున్నది. నేను పోయెద. [మదనసాయక నుద్దేశించి] సుందరీ! ఇదే వచ్చుచున్నాఁడను వచ్చుచున్నాఁడను.

[అని యొకవెస కరుగుచుండును.

[ ఆవంక నే గాలవుఁడు ప్రవేశించును. ]

గాల—[వానిహస్తములు పట్టుకొని] కుమారా! ఏమిది? ఆశ్వాసిల్లుము. [అని యతనిఁ గౌఁగిలింపుచు] నిన్ను నే విడిచి యున్నది ఒక్కనిముసముగదా? ఇంతలో నిట్లయితి వేమి?

ఋత—అయ్యో! నా ప్రాణేశ్వరి నన్నుఁబిలుచుచుండ నీవేల నన్నుఁ బోనీయవు?

గాల—[స్వగతము] నిజముగ ఇతనికి మతి చలించుచున్నది. [ప్రకాశము] కుమారా! ఊఱడిల్లుము. నీ ప్రాణేశ్వరి నిన్ను బిలుచు టెట్లు? పక్షుల కలవరమ్ములకు అట్లు భ్రమసియుందువు. రమ్ము రమ్ము. నీ యాసనముపై గూర్చుండుము. [అని యతని నాసీనుని జేయును.

ఋత—[లేచుచు] నన్నిచట నొంటరిగఁ గూర్చుండిడు మను దువా? ఇది మదనసాయక విరిదోఁట కాదా? మమ్ము నిర్వురను నీవేకదా సతీపతుల నొనర్చితివి? మేమిపుడు కలిసియుండవలదా? మహానీయా! నీకును దాయనైతినా?

గాల—[స్వగతము] హా దైవమా? సుకుమారమూర్తియగు ఈ యువరాజునకు ఎంతటి యిక్కట్టు తెచ్చితివి? ఇతనిని నేనెట్లు ప్రకృతిస్థుని జేయుదును? హా మూర్ఖ కేతుహతకా! ప్రజ్ఞయన్న నీయది కదా? ఆ గుహాగృహమున కెదుట ఋతధ్వజుఁడు నిన్ను సంహరింపక విడిచినందులకు ఎంత పనిఁ జేసితివిరా? [ప్రకాశము] కుమారా! విగతాసువైన మదనసాయకనుగూర్చి నీవు ఇంతగా విలపించుట పాడియా? నీకుఁ జిత్తవిభ్రమముకుండఁ గల్గుచున్నది. కావున నన్ను వినుము.

ఋత—నిన్నేల వినవలయు? నా జీవితేశ్వరిని స్మరింప వలదని కదా చెప్పెదవు?

గాల—కుమారా! నీకుఁ బ్రత్యుత్తర మీయఁజాలను. కర్మ ఫలమునకు వగవఁబనిలేదు. నీవు ఎట్లయిన ధైర్య మూనవలయు.

ఋత—నీ విపుడు నా స్థితియందున్నచో ఏమిచేయుదువో చెప్పెదవా?

గాల—అయ్యో! వలదు కుమారా!

ఋత—[వానిని వినక పచ్చికపై నాసీనుఁడగుచు]

గీ. హా! సతీ! యంచు నవని సా ♦ ష్టాంగ మెఱఁగి
అశ్రుజలముల నభిషేక ♦ మాడఁ జేసి
తలను నిట్టూర్పులనెడి చా ♦ మరము లొసఁగి
దుఃఖదేవత కీ వొన ♦ ర్తువు సపర్య.

గాల—అయ్యో వత్సా! తుదకు ఇట్లయితివేమి? నిన్నుఁ

జూచిన నాకు భయమగుచున్నది. లెమ్ము లెమ్ము. [అని లేవఁదీయుచు, నిర్వర్ణించి] ఎవరో యిటువచ్చుచున్నారు.

[ఋతధ్వజుఁడు నిజాసనముపైఁ గూర్చుండును.

అంత నొక ప్రతీహారుఁడు ప్రవేశించును.]

ప్రతీ—కుమారా! సార్వభౌముఁడు సపరివారుఁడై తమ్ముఁ జూడ నరుదెంచుచున్నవాఁడు.

ఋత—ఉచితాసనముల నేర్పఱుపుము.

[ప్రతీహారి యట్లొనర్చును.

[అంత శత్రుజిత్తును, అశ్వస్థుఁడును, విశోకుఁడును, రాజపరివారమును ప్రవేశింతురు. ఋతధ్వజుఁడు నతాననుఁడైయుండును.]

శత్రు—[అందఱుఁ గూర్చుండిన వెనుక] మిత్రమా! చూచితివా కుమారుఁడెట్లు కళదప్పియున్నాఁడో!

అశ్వ—అవు నవును. విధి బలీయము.

శత్రు—[గాలవు నుద్దేశించి] మునీంద్రా! కుమారుని చిత్తవృత్తి యిపు డెట్లున్నది?

గాల—ఏమి చెప్పుదును! నాకు భయముగొల్పుచున్నది. కుమారుఁడు ఇంచుకయు స్వస్థచిత్తుఁడు కాలేదు

శత్రు—[విచారముతో] అయ్యో! ఇఁక నేమిదారి? [ఋతధ్వజుని గదిసి బుజ్జగించుచు] పుత్రా! సమాశ్వసిల్లుము సమాశ్వసిల్లుము. నీ వెట్లు సర్వభోగ విముఖుఁడవై అప్రాజ్ఞునివలె అహోరాత్రములు ఒక తరుణికై పరితపింపవలెనా? ఊఱడిల్లుము. [నిరూపించుచు] వీఁడె నీ

మిత్రుఁడు విశోకుఁడు నిన్నుఁజూడవచ్చినాఁడు. వానితో సంభాషింపుము. మఱియు, ఈ మహానీయుని గనుము. నీ స్నేహితుని తండ్రి. నాకుఁ బ్రాణసఖుఁడు.

ఋత—జనకా? మీరందఱు నన్నుఁబరామరిసించుట కేల రావలయును? మదనసాయక లేక నాకీలోకము శూన్యము కదా?

శత్రు—తనయా! నీవిట్లనకుము.

గీ. దైవ నిర్దిష్టమైన కృ ♦ త్యమ్ము జరిగి
తీరుఁగద పుత్ర! విను నీకుఁ ♦ ద్రిభువనైక
మోహనులఁ దెచ్చి చేతు న ♦ ద్వాహ మిపుడు;
గొడ్డువోయెనె జగతి యా ♦ కొమిరెతోడ?

ఋత—జనకా! నీవు భ్రమపడుచున్నావు.

గీ. లాఁతికామిను లెంతటి ♦ లేఁత వయసు
వార లైనను నతి రూప ♦ వతులునైన
నెంత గుణవతు లైన నా ♦ యింతి సాటి
కారు; పోలరు సతి కాలి ♦ గోరనైన.

అశ్వ—[స్వగతము] ఔరా! ఈరాజతనయున కాసుందరి ప్రేమ నెంతమక్కువ? [ప్రకాశము] రాజనందనా! ఏమియిట్లందువు?

గీ. వంటిపాటైన సతి యొటు ♦ వంటిదైన
వనరునేడ నామె వెండియు ♦ వచ్చునయ్య?
కానఁ బ్రాజ్ఞుఁడవై ధైర్య ♦ మూనుటొప్పు;
చెలిని సృజియింప మనము బ్ర ♦ హ్మలము కాము.

ఇంతియకాక,

గీ. ధరణీ నాథున కేక పు ♦ త్రకుఁడ వంట;
పండితుఁడ వంట; ఎనలేని ♦ బంట వంట;

ఈ విపత్తును సైరింప ♦ వేనిఁ దల్లి
దంద్రాలది కాదె జాతి ? దోర ♦ తనము చెడఁగ ?

ఋత—మహనీయా! నాప్రేయసి నాకై చనిపోయినది. ఆమెను మఱచుట సాధ్యముకాదు. ఆమె నగుమొగము నొకసారి కనిసంగాని నా మనస్తాపము తీఱదు,

శత్రు—అయ్యో! కుమారుని వెఱిగుఁదినము! ఇంక నేనేమి చేయుదును ? కుమారుఁ డెట్లు సమాహితుఁడగును ?

గాల—మానవేశ్వరా! మదనసాయక రూప పటమునైన సంగ్రహింపవైతివి. దానినిగని కుమారుఁడు ఒకించుక ఊఱటఁ జెందునేమో ?

ఋత—మందభాగ్యుఁడను. నాకు అట్టిపున్నెమెవుడేల చేకుఱును ?

శత్రు—కుమారా! అట్లనకుము. నేనే మందభాగ్యుఁడను. నేనే అపరాధిని.

అశ్వ—అట్లయిన వినుము. [శత్రుజిత్తు నుద్దేశించి] మిత్రమా! నాఁడు నేనిచటికి వచ్చినప్పుడు గతాసువైన మదనసాయకను చూడఁబోవుటకును, నీదేవి ననునయించుటకును నీవు శుద్ధాంతమున కరుగుట నీ వెఱింగిన విషయమేకదా ? తదుపరి నీ ఆవేదనము చూడఁజాలని అంతఃపురపాలకులు నా యొద్దకువచ్చి నిన్నూఱడించుటకు నన్ను నీకడకుఁ గొనివచ్చిరికదా ? అప్పుడు నాపరివారములో నున్న శిల్పియొకఁడు నాతో వచ్చియుండెను. అతఁడిపుడు తన శిల్పకళానైపుణి దేటఁబడునట్లు మదనసాయకా

విగ్రహమొకండు నిర్మించియున్నవాఁడు. అది యిపుడు నామందిరమున నున్నది. నా కుమారుఁడు దానిని యువరాజున కర్పించుటకే నిశ్చయించియున్నాఁడు. యువరాజు సమ్మతించెనేని అతనిని నా వెంటఁగొనిపోయి దానిని గనఁబఱచెదను.

ఋత—[ఆసనమునుండి దిగ్గన లేచి] మహాసీయా! ఇదే వచ్చుచున్నాఁడను. నీకుఁ గృతజ్ఞుఁడను. నా ప్రాణేశ్వరిని ఏ రూపముననైన ఒక్కసారి చూచెదనుగాక.

గాల—[ఋతధ్వజుని హస్తములు పట్టుకొని] కుమారా! ఏల ఆత్రపడెదవు? నీవిట్టిస్థితిలో ఎట్లు ప్రయాణము సేయఁగలవు?

ఋత—నా బహిఃప్రాణమైన మదనసాయకను జూడఁబోవుట నాకేమి కష్టము? నీవు నన్ను ఆటంక పెట్టవలదు.

శత్రు—[ఋతధ్వజునితో] కుమారా! తాళుము. [అశ్వస్థునితో] సుహృద్రత్నమా! మిగుల ససిచెడియున్న కుమారుని ఇపుడు పయనమొనర్చుట నాకిష్టములేదు. ఆ విగ్రహమును ఇచటికే రప్పింపఁగోరెదను.

అశ్వ—అది నూతనముగ నిర్మింపఁబడినది. దానిరంగు లింకను ఆఱుటయే లేదు. కావుననే మేము దానిని దోడ్కొనిరాలేదు.

శత్రు—అయిన మేమందఱము కుమారునితో వచ్చెదము.

అశ్వ—అంతటిభాగ్యము నాకబ్బునా? అప్పుడుకదా నామందిరము పవిత్ర మగును?

శత్రు—[ప్రతీహారి నుద్దేశించి] ఓరీ ప్రతీహారీ! నీవు త్వరగా పోయి ప్రధాన మంత్రితో మా ప్రయాణ సమాచారము చెప్పి వాహనముల సిద్ధపఱుపు మనుము.

ప్రతీ—మహాప్రసాదము. [నిష్క్రమించును.

శత్రు—[తనయు నుద్దేశించి] కుమారా! రమ్ము. మనమిఁకఁ బ్రయాణ సన్నద్ధుల మగుదము. [లేచుచు నితరుల నుద్దేశించి] మనమందఱము నగరులోని కేఁగుదము. రండు.

[అందఱు నిష్క్రమింతురు.

స్థలము—నాగలోకము : రంగము—అశ్వస్థుని మందిరము.

[మదనసాయక ప్రతిమ మ్రోల అశ్వస్థుఁడు ప్రవేశించును.]

అశ్వ—మదనసాయక ప్రతిమ యయ్యెఁగదా! అద్దిరా నావశ్య విద్యాప్రభావము! ఇఁక భర్తృదారకుఁడు ప్రాయోపవేశము నర్చునా? ఔరా! నేఁడెట్టి సుదినము! నేఁడునాకు ఎంతటి సంతోషమబ్బును!

[అంత విశోకుఁడు ప్రవేశించును.]

విశో—జనకా! సార్వభౌముని యొక్కయు, బరివారము యొక్కయు, వాహనములు మన మందిరమును సమీపించు చున్నవి. వారిని మన మిపుడు యథోచితము సంభావింప వలయునుగదా?

అశ్వ—అప్పుడే వచ్చుచున్నారా? [ప్రతిమపై యవనిక దీర్చి] రమ్ము. వారి నెదుర్కొందము. [అనుచు నర్థోక్తిలో] కాని విశోకా! నీవు ఇచటనే యుండి ఉచితా

సనములఁ నేర్పఱపుము. నేనుఁబోయి వారిని దోడ్కొని వచ్చెదను.

[అశ్వత్థుఁడు నిష్క్రమించును. విశోకుఁడు ఆసనములఁ దీర్చును]

[అంత శత్రుజిత్తును, ఋతధ్వజుఁడును, గాలవుఁడును, అశ్వత్థుఁడును, రాజ పరివారమును ప్రవేశింతురు.]

శత్రు—మిత్రమా! అశ్వత్థా! అదేమియోకాని నేఁడు నా మనము హాయిని జెందుచున్నది. ఇది నీమందిర మాహాత్మ్యమో లేక నీ సమాదరణ మాహాత్మ్యమో?

అశ్వ—వయస్యా! నీ విట్లనరాదు. నీయట్టి సర్వంసహాధినాథుఁడు నాగృహమున కేతెంచుట తొలిజన్మమున నే నొనర్చిన నోములు ఒక్కటఁ బండినట్లుకదా! నాపుట్టువు సార్థకమైనట్లు కదా? [నిరూపించుచు] సార్వభౌముఁడు ఈ యాసనము నధిష్ఠింపఁగును. కుమారునకును, మునివరునకును, ఇవే యాసనములు. రాజపరివారము ఆయా ఆసనములపై నాసీనులగుదురు గాక.

శత్రు—మిత్రమా! నీకు శ్రమయిచ్చుటకే మేమందఱము వచ్చితిమి. కూర్చుండుట కేమి? మేమిపుడు మదనసాయకా విగ్రహమును జూచుటకుగదా వచ్చితిమి? నీమందిరమున నున్న విచిత్రములఁ బెక్కింటి సరసితిమి కాని అది యెందును గానరాలేదు. దానింగనుటకై కుమారుఁడు ఉవ్విళ్లూరుచున్నవాఁడుగదా?

అశ్వ—సఖా! నీకోడలి విగ్రహముఁ నిర్మించిన శిల్పకారుని పనినేర్పు వర్ణింప నలవికాదు. దానినిఁ జూచిన వారెల్లరు జీవప్రతిమ యని భ్రమపడుచున్నారు. అందువలనఁ

దక్కిన విచిత్రములనడుమ దాని నుంచలేదు. నీవుకూడ అట్టి పనివానితనము ఇంతకు ముందెన్నడును జూచి యుండవు. అది యిచటనే యున్నది. మీరండఱు గన వచ్చును. విచ్చేయుఁడు.

[అని తెరయెత్తి మదనసాయక నఁజూపును. అందఱుచూచిని శ్చేష్టులగుదురు]

చూచితివా నీకోడలిని? [ప్రత్యుత్తర మీకుండుటగని]
ఓహో! మీరండఱు నిశ్చేష్టపడియున్నవారు. విగ్రహస్థాపనము మీ మనముల నాకర్షించిన దనుకొనియెద. అటులైన మేలే. [ఋతధ్వజు నుద్దేశించి] కుమారా! నీ ప్రియురాలి ఆకృతి యిందొప్పుచున్నదా?

ఋత—[కని కని, దిగ్గనలేచి]

క. ఇదె నా సతి! ఇదె నా సతి!
ఇదె నిజముగ నాదు జీవితేశ్వరి! [మద. నుద్దేశించి] తరుణీ!
బ్రదికితి బ్రదికితి; నిన్నదఁ
గదియించెదఁ; దాపమోపఁ; గనుము కను మిదే.

[అని యామెను కౌఁగిలింపఁబోవును.

గాల—అయ్యో! రాజసూనుని పామరత్వము!

అశ్వ—[ఋతధ్వజుని వారింపుచు] రాకుమారా! తాళుము తాళుము. ఇది మదనసాయక ప్రతిరూపము కాని మగిన సాయక కాదు. ఇంతకును విగ్రహము అతినూతనముగ స్థాపింపఁబడినది. నీవిపుడు దాని నంటుదువేని, రంగులు చెడిపోవును.

ఋత—[విచారముతో] అయ్యో! నేను మోసపోయితినా! ఈమె నా హృదయేశ్వరి కాదా? హాహా!

[అని ఒక యాసనముపైఁ గూలును.

గాల—[వానిని బుజ్జగించుచు] కుమారా! ఆశ్వసిల్లుము. నీవుమరలఁ బ్రాఁతదారియే త్రొక్కుచున్నావు లెమ్ము. ఏలిక నిలువఁబడియున్నాఁడు. [అని లేవదీయును.

శత్రు—[కొంతవడికి] మదనసాయక! సజీవ! హా! ఇది విభ్రమమా! [గాలవు నుద్దేశించి] మునిపుంగవా! మదన సాయక యిల్లేకదా ఉండును? ఔరా! ఏమి యా శిల్ప కారుని బుద్ధికుశలత!

క. నలువయె తన టంకముతో
పల నెలకొని యుండవలయుఁ ♦ బ్రతిమ నిటులు తా
మలుచుటకు; గాని యెవ్వని
కలవి యిటు సజీవ మాన ♦ వాకృతిఁ జేరఁ?

అయ్యో! ఇట్టిసౌందర్యవతియగుకోడలు నాకేలదక్కను?

గాల—ఇట్టి అద్భుత శిల్పచాతుర్యము ఇంతకుముం దెన్నఁడును గనివిని యెఱుఁగను. ఔరా! నరునికి ఎయ్యది యసాధ్యము?

ఋత—మహానీయా! నీవు ఆ శిల్పిచే నాప్రాణేశ్వరి ప్రతిమకు ఏల ప్రాణము పోయించినావుకావు? నేనిట్లు పరితపింప వలె ననియా?

అశ్వ—కుమారా! మదనసాయక మృతిచే మీ తండ్రికుమారులమనమ్ములు మున్నే సంక్షోభించుచున్నవి. ఇప్పు డామె విగ్రహమును గనిన ఒక్కింతయైన నూఱట జెందు నను కొంటిని. కాని మీరు మఱల నిట్లగుదురని యెఱుంగను. కాఁబట్టి మీయనుమతిని యవనిక సవరించెద.

[అని యట్లు చేయఁబోవును.

ఋత—[వారింపుచు] అయ్యో వలదు వలదు. నేనిఁక విలపింపను. నాప్రేయసిని గనుచు నేను ఇట్లే ఊరక నిలువఁబడి యుండెద.

అశ్వ—కుమారా! మూపఱకు ఇది చేతనప్రతిమ యను భ్రమగొల్పునని అప్పుడే చెప్పియుంటినిక దా? అట్లే మీరును మోసపోవుచున్నారు. మీరింకను గనుచుందు రేని ఇది కదలుచున్నదని కూడ అనుకొందురు. మరలఁ జూతురు లెండు. [అని తెర దీర్పఁబోవును.

శత్రు—[వారింపుచు] మిత్రమా! ఉండుముండుము. మే మెన్నఁడును అట్లూహింపము. ఈమనోహర విగ్రహమును ఎంత చూచినను దనివి దీఱకున్నది. [గాలవు నుద్దేశించి] యతివర్యా! చూడుము చూడుము.

క. హా! యేమివింత! ఊపిరి
దీయుచె యీరీతి నే ప్రతిమ యైనన్? గం
దోయియు జీవకళల నెడఁ
బాయదు; మఱియందుఁ జపల భావము దోఁచున్.

గాల—రాజేంద్రా! అకల్పిత భ్రాంతి నొదవించినప్పుడుక దా కళవన్నెకెక్కును? నిక్కముగ ఇది విశ్వకర్మ నిర్మితమని తోఁచెడిని. లేనిచో దీనియందు సజీవత్వము ఎట్లు [illegible]మును?

శత్రు—మఱియు ఆహస్తములది సహజారుణిమ కాదా?

అశ్వ—ఇఁక నేను దెర సరిదీయుటయే మేలు. నామిత్రుఁడిపుడు భ్రాంతి వివశుఁడై మైమఱచి యున్నవాఁడు.

ఈ విగ్రహము జీవముతో నున్నదనిసుండ ఇఁక నన వచ్చును. [అని అట్లు చేయఁబోవును.

ఋత—అయ్యో! వలదు వలదు. నిన్ను బతిమాలెదను. నీవట్లు చేయుదువేని నేఁడే నాప్రియురాలు చనిపోయినట్లు నామదికిఁ దోఁచును. కావునఁ దెర యట్లే యుండనిమ్ము.

అశ్వ—రాజనందనా? నీ మనస్సునకు హాయిని గూర్చుటకు బదులు ఈ విగ్రహమును జూపుచు నిన్నిపుడు బాధించు చుంటినిగదా? నిన్ను ఇంకను బాధింపుమందువా?

ఋత—నీవు ఏమిచేసినను సరియే కాని నాప్రేయసిని మాటు పఱుపకుము. నన్ను ఆయనుపమాంగి సౌందర్యలహరిలోఁ దనివిదీఱఁ దోఁగనిమ్ము.

అశ్వ—అయిన నీ యిష్టము. [అని కొంతవడియాఁగి, శత్రు జిత్తు నుద్దేశించి] మిత్రమా! నీవును, నీ కుమారుఁడును ఇపుడెల్లను విచార సాగరమున మునింగి యున్నవారు కదా? మిమ్ము నిఁక విస్మయాబ్ధిని దేల్చెదఁ జూతురా?

శత్రు—నీమందిరమున అన్నియును మాకు విస్మయమునే కొల్పుచున్నవి. నీది మాయలప్రోలుగదా? నీ యిచ్చవచ్చి నట్లొనర్పుము.

అశ్వ—అయిన వినుఁడు. మీరందఱు ధైర్యముతో జూడఁ గల్గితిరేని నేనిపుడు ఈ విగ్రహమును గదలునట్లు చేసె దను. అదిఅల్లన దిగివచ్చి ఋతధ్వజుని కరగ్రహణమొనర్చి అతనిని కౌఁగిలించును. కాని మీరెవ్వరును వెఱఁగందఁ గూడదు.

శత్రు—నీవు ఆమెచే నేమిపనులు చేయించినను అవి యట్లే చూచుచుందుము. ఆమె ఏమిమాట్లాడినను అవి యట్లే వినుచుందుము. కాని మాకెవ్వరికిని భయములేదు. కానిమ్ము.

అశ్వ—అట్లయిన సరియే. మీరండఱును అట్లే నిలువఁబడి యుండుఁడు. కాని పిటికిగుండె గలవారు ఇప్పుడే బయటికిఁ బోవచ్చును.

శత్రు—కానిమ్ము కానిమ్ము. ఎవరును గదలఁ గూడదు.

అశ్వ—ఏదీకొంచెము సంగీతము ? [తెరలో సంగీతము వినఁబడును.

అశ్వ—[విగ్రహము నుద్దేశించి]

సీ. తరుణి! నీకొఱకు సం ♦ తాప మొందుచు నీప్రి
యుఁడు వీఁడె నినుఁ గోరి ♦ యున్నవాఁడు
సపరి వారుఁడు నీగు ♦ శ్వశురుండితఁడె చాల
ఖిన్నుఁడై నినుజూచు ♦ చున్నవాఁడు
నాఁడు నీకు శుభమ్మొ ♦ నర్చిన మాని వ
ర్యుఁడితండె నీప్రేమాల ♦ నున్న వాఁడు
నీ మనోహరుకూర్మి ♦ నేస్తంబు నాపట్టి
యును వీఁడె సఖునట్లె ♦ యున్నవాఁడు
లీలఁ గేల్పట్టి పతిఁ గాఁగి ♦ లింపుమమ్మ!
నృపతి కీయతికి నమస్క ♦ రింపుమమ్మ!
డిగుము; తఱియయ్యె; విడనాడు ♦ మిఁగను ఱాతి
రూపు; రారమ్ము వెలఁగొల్వ ♦ చూపఱకును.

చూచితిరా ఆమె మెదలుచున్నది.

[మదనసాయక కుట్టిమము దిగి క్రిందికి వచ్చును. అందఱు నదిరి పాటునూచింతురు.]

ఏల మీరదిరిపడెదరు? ఆమె మిమ్ము నేమియుఁ జేయదు. [స్మితముతో] అయ్యో! మీరామెను గొలఁగి పోకుఁడు. [ఋతధ్వజు నుద్దేశించి] కుమారా! నీవును జంకుచున్నావేమి? అపుడు నీవు ఆమెపైఁబడి కౌఁగిలింపఁ బూనితివే? నీ హస్తము ఆమెకిమ్ము. తొల్లి గాలవాశ్రమమున మీకు గాంధర్వమయ్యెనుగదా? ఇపుడు నా మందిరమున మరల మీకు గాంధర్వము.

[ఋతధ్వజుఁడు హస్తమొసఁగును. మదనసాయక దానింగొని, "హా ప్రాణేశ్వరా!" అంచు నతనినిఁ కౌఁగిలించును.]

ఋత—[ఆశ్చర్యముతో] ఓహో! ఈమె సజీవ! మదన సాయక! నా హృదయేశ్వరి! [మదనసాయక నుద్దేశించి] హా! జీవితేశ్వరీ! అని వెండియుఁ కౌఁగిలించును.

శత్రు—ఏమిచిత్రము! కుమారునిఁ గౌఁగిలింపుచున్న దే?

గాల—"ప్రాణేశ్వరా!" అనికూడ అనుచున్నది. ఇది యేమో యింద్రజాలమువలె నున్నది.

శత్రు—[అశ్వస్థు నుద్దేశించి] మిత్రమా! ఇదియేమి? నిజమా విభ్రాంతియా? ఈమె మదనసాయకయేనా? యువరాజ పత్నియేనా? ఈమె ఎట్లు బ్రతికినది? నీమందిరమున ఎట్లు న్నది? ఈ యభ్యుదయము నేఁడు మాకు ఎట్లు కలిగినది?

అశ్వ—మిత్రమా? ఏమి చెప్పుదును? నా పట్టణమున మీ పూర్వులు ప్రతిష్ఠించిన చండికాలయమునకు రాజకుటుంబమున జరుగనున్న వివాహకార్యములకు ముందుగ వధూవరులువచ్చి దేవిని దర్శించుటయు, నామందిరమునఁ

ప్రారంభోత్సవము జరుగుటయు, నీవంశమందు అనుశ్రు
తాచారమై యున్నదికదా? ఆయాచారము ఇపుడు నీవు
తప్పించుటచే కల్గిన అనర్థమేయిది. మదనసాయక అకాల
మరణమునకుఁ గారణము నేను దివ్యదృష్టి నరయఁగాఁ
సదాచార ప్రతిరోధమువలనఁ జండికకుఁ గల్గిన ఆగ్ర
హామే యని తేలినది. అపుడు నేను ఆదేవి నారాధిం
పఁగా ఆమె ప్రసన్నయై నన్నుఁజూచి "బిడ్డా! మదన
సాయక మరణించుటలేదు. మహారాజ కుటుంబము
వివాహ సంరంభములందు నన్ను మఱచుటచే నేనామె
కట్లు మృతస్వరూపము కల్పించితిని. కాని యామె
అమర్త్యయని నీవు మఱవరాదు. రాజకుటుంబ మంగళ
అనుశ్రుతాచారము నీవు జ్ఞప్తికిఁ దెచ్చినను మహారాజు
వినలేదుకదా?" అని చెప్పెను. నేనపుడామె నెన్నియో
విధముల బతిమాలి నీకోడలిని నీకనుగ్రహింపుమని వేడగా
ఆ ప్రేమమయి వెంటనే పోయి తేజోరూపమున మదన
సాయక శయనాగారమునఁ బ్రవేశించి ఆమె నిచటికి
ఆనాఁటి నిశీథ సమయముననే కొనితెచ్చి దేవతారూప
మును మఱల నామె కనుగ్రహించి నా కప్పగించినది.
కాని తన్ను ఏరూపమున నిచటఁ బ్రతిష్ఠించి యిపు
డిట్లుపేక్షించిరో అట్టిరూపముననే తొలిమీకుఁజూపి, చేసిన
తప్పిదమునకుఁ జాలినంత మనోవ్యథ మీకుఁ గలిగిన పైని
ఆమెను ప్రబోధించి మీకిడవలయునని నాకానతిచ్చి
తాను అంతర్హితయయ్యె. ఆమె యాజ్ఞ ననుసరించి
నావశ్యవిద్యా ప్రభావముచే మదనసాయకకు ప్రతిమా
రూప మొసంగితిని. ఇదియే మిమ్ము నిచటికి ఈరీతిని నేను

రావించుటకుఁ గారణము. ఇందువలననే మిమ్మునందఱను ఇంతవఱకు శోకసంతప్తులుగ నుంచవలసివచ్చినది. వయస్యుఁడు నన్ను మన్నించునుగాక.

శత్రు—[అతని హస్తములు పట్టుకొని] అయ్యయ్యో! మిత్రమా! ఏమియిట్లందువు? నేనే మహాపరాధిని. అనుశ్రుతాచారమును నేనెన్నఁడైన మఱవ వచ్చునా? అట్టిస్థితిలో నీవు నాకు జ్ఞప్తికిఁ దెచ్చినను పోనిమ్మనుచు నేనుపేక్షించి నీకుమారునిఁ బంపివైచితిగదా? ఇట్టి మంద బుద్ధి శిక్షార్హుఁడు కానిచో క్షంతవ్యుఁడు; కాని క్షమింపు వాఁడెన్నఁడును గాఁడు. ఆహా! జగన్మాత తన బిడ్డలయెడల నెంతటి దయాళువు! మిత్రమా? ఇంతియకాక ఆఁకలిగొన్న వారికి అమృతాన్న మిడిన విధమున అమిత శోకార్తుల మగు మాకిపుడు ఆమితానందము గూర్చితివి. నీఋణ మెట్లు తీర్పఁగలను?

అశ్వ—మిత్రమా! నీ పురోభివృద్ధినే నేను ఎల్లప్పుడుఁ గోరువాఁడను. దీని కేమి? సర్వవిధముల నేఁడు మనకు శుభదినము. కావున నేఁడే బిడ్డ లిరువ్వురును నా మంది రమునఁ బెండ్లికొడుకును, బెండ్లికూతురును అగుటయు, మనమందఱము యథోచితము చండికను దర్శించుటయు జరుపుదుము గాక.

శత్రు—మిత్రునియాజ్ఞ. ఇవిగో కర్తవ్యములు. అయ్యో! దేవినిగూడ దోడ్కొని రానైతిని!

[అంత నొక యాశ్వికుఁడు ప్రవేశించును.]

అశ్వి—[కేల్మోడ్చి] మానవేశ్వరా! దేవిగారు ఏలిక కిట్లు

నివేదింపు మనిరి. "యువరాజ పత్ని మదనసాయక ధాత్రేయియు, ఆమె తలిదండ్రులును వివాహోత్సవమునకు వచ్చుచుండ దమకుమారి చనిపోయినదను సమాచారము మార్గమునవిని తమ తమ అరదములలో వారు బిట్టు మూర్ఛవడి యున్నవారఁట." ఈ యుదంతము వారి పరివారమువలనఁ దెలిసి కర్తవ్యమేమియుఁ దోఁచక దేవర సన్నిధికి నన్ను హుటా హుటిగఁ బుత్తెంచినారు.

శత్రు—అయ్యయ్యో! [ఆశ్వికు నుద్దేశించి] ఓరీ! నీవు మరల సత్వరముగఁబోయి నాఁడు మన అంతఃపురమునుండి అదృశ్యయైన మదనసాయక నా మిత్రుని మందిరమునఁ క్షేమముగ నున్నదనియు, ఆమెను దోడ్కొని మేము శీఘ్రముగానే వచ్చుచున్నామనియు దేవితోఁ జెప్పుము. విశ్వావసు ప్రభృతుల నెదుర్కొనిఁ వారల కీ యుదంతము చెప్పి తోడ్కొనివచ్చి మా సౌధమున వారిని యథోచితము సత్కరింప వలయునని ముఖ్యమంత్రితోఁ జెప్పుము. పొమ్ము పొమ్ము.

ఆశ్వి—మహాప్రసాదము. [అని నిష్క్రమించును.

శత్రు—ఇప్పుడు స్ఫురణకు వచ్చినది. [అశ్వఘ్ను నుద్దేశించి] మిత్రమా! కుమారుని వివాహమునకు ఇఁక రెండు దినములే గడువున్నది. కావున దేవిని దర్శించి అతిశీఘ్రగమనముతో మనము ప్రయాణ మొనర్పవలయు. మీ రందఱు మా తోడనే తరలి రావలయును.

అశ్వ—వయస్యుని యాజ్ఞ. అట్లే వచ్చెదము. [విశోకుని నుద్దేశించి] విశోకా! నేఁడు మన ప్రయాణమునకై

వాహనముల సిద్ధపఱుపుమని అశ్వపాలకునితోఁ జెప్పి త్వరగా రమ్ము. [విశోకుఁడు నిష్క్రమించును.

శత్రు—నేఁడిట్టి మంగళము మాకొనఁగూర్చిన మదీయప్రాణ సఖుఁడగు ఈ మహానుభావునకుఁ గుమారుఁడును, కోడ లును మాకనుల వేడుకగా ఒకసారి ప్రణమిల్లఁగోరెద.

ఋత } —మహాప్రసాదము. [అని యట్లొనరింతురు.
మద }

అశ్వ—బిడ్డలకుఁ గళ్యాణ పరంపరలు పరమేశ్వరుఁడు ప్రసా దించునుగాక! లెండు. బిడ్డలారా! లెండు. [వారు లేచి వెనుక. మదనసాయక నుద్దేశించి] పుత్రీ! ఆర్యపుత్రుని ఎపుడుచూతునని తపింపుచుంటివిగదా? ఇప్పుడు చూచి తివా? [మదనసాయక తలవంచును. పిదప ఋతధ్వజుని లాలింపుచు] కుమారా! నీమనస్తాపము దీఱినదా? విన్న మిగులఁ వేధించితిని జుమా?

శత్రు—సఖా! ఏమియిట్లనెదవు? నీకతమ్మున నేఁడుగదా మాకు సకలాభ్యుదయములును జేకూరినవి? ఇఁక గుమా రుని వివాహమునకై మన మందఱము గలసి శీఘ్రముగ బయలు వెడలితిమేని మా అభ్యుదయములు పూర్తి యగును.

[అంత విశోకుఁడు మరలఁ బ్రవేశించును.]

విశో—[అశ్వస్థునితో] జనకా! చెప్పివచ్చితిని. సార్వభౌముని వాహనములును, మన వాహనములును అప్పుడే ప్రయాణ సన్నద్ధము లగుచున్నవి.

శత్రు—సరియే. నేఁటి సాయాహ్నమే మనప్రయాణము. మన మిఁకఁ గర్తవ్యమరయుదము. [ఋతధ్వజు నుద్దేశించి] కుమారా! మనకిఁక వాంఛనీయము ఏమైన నున్నదా?

ఋత—ఏమియు లేదు. కాని యిట్లగునటు లానతిండు.

## ఉత్సాహము

దేశ విప్లవముల నీ పృ ♦ థివి యెఱుంగ కుండుతన్
దేశ పుంజరి శ్రమను ల ♦ తి ప్రశస్తి గాంచుతన్
దేశ భక్తి లహరు లెల్ల ♦ దేశములను బాఱుతన్
దేశ మున జనమ్ము పాడి ♦ తెరువు ననుగమించుతన్
దేశ మొఘముఁ బాడి పంటఁ ♦ దేలు చుండుతన్; కృతుల్
దేశ కాల సమనుకూల ♦ దివ్య కవిత నెసఁగుతన్
దేశ విహిత కార్యకరణ ♦ దీక్ష తనయు లూనుటన్
దేశ మాత బుట్టుము లెస్స ♦ దీఱుఁగాత! మఙ్గళమ్!

శత్రు—తథాస్తు!

[అందఱు నిష్క్రమింతురు.

సమాప్తము.

---

# మదనసాయక — లఘుటీక.

పుట.

1. (నాందీపద్యమున) నేర్పుమై — నేరుపెచ్చుటనిన, "ఈ (తన) మెయిదీవె", "నీ (తనపతి) మెయిదీవె" యనుచు నిందిర ప్రత్యుత్తరమందు అర్థాంతరము స్ఫురింపఁజేయుటయే.
హావణించిన వ్రీడ—ఇట్లనుటచే ఈ నాటికమందలి నాయిక ముగ్ధ యని సూచింపుట.

2. మదనసాయక ప్రయోగము=ప్రకృత నాటక ప్రయోగము; అర్థాంతరమందు మన్మథబాణ ప్రయోగము.
ఆర్యపుత్రుఁడు=(నాట్యసంకేతమందు) పెనిమిటి.
ఇది వానకారుగదా?—మన్మథ బాణములగు అరవిందము, అశోకము, చూతము, నవమల్లిక, నీలోత్పలము అనునీ ఐదుపుష్పములు వర్షర్తువునందు దుర్లభములని ప్రతీతి.
కామజనక సీమంతిని = లక్ష్మి; అర్థాంతరమందు కామోద్దీపనము కలిగించెడి యువతి.

4. రజనిచరుఁడు = రాక్షసుఁడు, — ఇచట తాళకేతుఁడు. ఇతఁడు కుముద్వతి పుత్రికయగు మదనసాయక నపహరించినాఁడు. (నాట్యపరిభాషయందిది సూచ్యార్థసూచన మనఁబడుచున్నది.

5. గీము = ఇల్లు.

6. కొందలపడు = కలఁతనొందు.

9. సోఁకుమూఁక = రాక్షస సమూహము.

11. రాణువ = సేన.

17. పొలసుదిండి = (మాంసము దినువాఁడు) రాక్షసుఁడు.
తేఁకువ = ధైర్యము.

25. టకటొంకరి = కుత్సితుఁడు.

44. పెల్లిదము = అధికము.

45. నునుఁబ్రాయి = అపక్వము, unripe.

52. మనోభవ శరనిధి = పుష్పములకు నిధానము; అర్థాంతరమందు మన్మథ బాణములచేఁ గొట్టఁబడినది.

పురుషతిలక సహిత = పొన్నచెట్లు, తిలక వృక్షములు కలది; అర్థాంతరమందు పురుషశ్రేష్ఠునితోఁ గూడుకొన్నది.

కుందరదన......పల్లవాధర = మల్లెమొగ్గలే దంతములు...... చిగుళ్లే అధరోష్ఠము—ఈ విధముగ వనసుందరి చిత్రింపఁబడినది. ఇచట రూపకాలంకారము.

మంజులాంగి = పొదరిండ్లే శరీరముగాఁగలది.

సుకుమారి = మంచి చేమంతులు గలది.

57. కనలు = కోపించు.

69. వైళము = శీఘ్రము.

71. తఱియు = సమీపించు.

81. కంచుకి = (నాట్యోక్తియందు) అంతఃపుర సేవకుఁడు.

83. చేటి = (నాట్యోక్తియందు) అంతఃపుర దాసి.

84. ముమ్మరము = అధికము.

88. వత్తలు = వరుగు.

91. కట్టిఁడి = క్రూరుఁడు.

99. భర్తృదారకుఁడు = (నాట్యపరిభాషయందు) యువరాజు.

100. విచిత్రములు = విశిష్టములగు చిత్రములు.

104. తోఁగు = మునుఁగు.

మాయల ప్రోలు = వింతలపట్టణము, city of marvels.

109. బిట్టు = అధికముగ.

హుటాహుటి = శీఘ్రగమనము.

110. కతము = కారణము.